ప్రథమ ముద్రణము 500

సర్వస్వామ్యములు రచయితవి

శ్రీముఖనామ సంవత్సరం
హేమంతం–పుష్యమాసము

1994 – జనవరి

వెల రు. 8-00

ముద్రణ : డి. బి. ప్రింటర్సు, విజయవాడ –2

---

ప్రతులకు
**పి. దుర్గారావు, ఎమ్. ఓ. ఎల్.**
తెలుగు పండిత్, జిల్లా ప్రజా పరిషదున్నత పాఠశాల
అడవిదేవులపల్లి, (వయా) మిర్యాలగూడ
నల్లగొండ జిల్లా 508207



సమర్పణ:

ఉదాత్త భక్తితో;

ఊహాకందని ఉత్సాహంతో,

కష్టజీవులతో కలిసికూర్చుని

కమ్మని కమనీయ కంఠాలతో

పలకా, బలపం, పుస్తకాలతో పాఠాలు బోధించిన

బాలబోధకులకు

అరవిరిసిన గులాబీల అందాల పూగుత్తులతో

# వినయ వాక్యము

నల్లగొండ జిల్లాలో అడవిదేవులపల్లి గ్రామములో ఒక సామాన్య ఉపాధ్యాయుడను జ్ఞానోదయ సమితి నల్లగొండ వారు నిర్వహించిన చదువు వెలుగు కార్యక్రమంలో సహాయ గ్రామ కో-ఆర్డినేటరుగా పనిచేయుట జరిగినది. నేను జేసినది చాల స్వల్పమైనా జీవితంలో సుకర్మగా భావిస్తున్నాను.

ముఖ్యంగా ఈ నాటికను వ్రాసి ప్రచురించడానికిగల ఒకటి రెండు కారణాలు-ఒకటి జ్ఞానోదయ సమితివారి ద్వార అందజేసిన మూడు పుస్తకాలలో కొన్ని కొన్ని పాఠాలు హృదయాన్ని స్పందింపజేసినవి. ఆ హృదయ స్పందనమే ఈ విధంగా నాటిక రూపంలో వ్యక్తీకరిస్తున్నాను.

రెండవ కారణం- ఈజనజాగరణ కార్యక్రమంలో విద్యార్థులు నిర్వహించిన పాత్ర మరుపురానిది. కౌమార దశలో ఉన్న ఈ బాల విద్యార్థులు, బాల ఉపాధ్యాయులుగా ఉత్సాహంతో బయలుదేరి, తమకంటె వయసు మీరిన వారితో, వృద్ధులతో కలిసికూర్చొని, కిరసనాయిలు లాంతర్ల సహాయంతో పాఠాలు బోధించడం నాకు విచిత్రమైన అనుభూతి కలిగించింది. అంతేగాక వారు రాత్రి పది గంటల వరకు వారితో కూర్చొని పాఠ్యాంశములు బోధించడము, యిండ్లకు తిరిగి వెళ్ళడం చూస్తే వారికీ వీరికీ ఏనాటి సంబంధమోనని నాకు ఆశ్చర్యమనిపించింది. ఆ బాల ఉపాధ్యాయులను అభినందించడానికి చేసిన యత్నమే యీ నాటిక.

ఈ నాటికలో నేను ప్రత్యేకంగా వ్రాసినది ఏమీ లేదు. జ్ఞానోదయ సమితివారు అందజేసిన మూడు పుస్తకాలలో ఉన్న విషయాలను ఆధారంగా జేసికొని కూర్పు చేయడం, పత్రికలు అందజేసిన వార్తలను ఆధారంగా జేసికొని నాటికను పూర్తిచేయడం జరిగింది.

ఇంకా మూడవకారణం - మహిళా మహోద్యమం. ఈ ఉద్యమం ప్రపంచ చరిత్రలో అపూర్వమైనదనీ, మద్యాన్ని నిషేధించమని స్త్రీలు ఉద్యమం నడపడం, ముందుకు రావడం ఏ దేశ చరిత్రలో జరగలేదని విజ్ఞుల అభిప్రాయం. స్త్రీలలో ఇలా ఒక్కసారిగా చైతన్యం, జాగృతీ కలగడానికి కారణం రాత్రిబడులే కారణమని మేధావుల అభిప్రాయం.

ఈ అక్షరజ్యోతి కార్యక్రమం పూర్తి సాఫల్యాన్ని పొందలేక పోయినా, నూతనమైన మహోద్యమాలకు, సంస్కరణలకు దారి తీస్తుందని అనుభవం ద్వార తెలుసుకున్నాం. దేశం సంపూర్ణమైన అక్షరజ్ఞానంతో తులతూగినట్లయితే-మరి యెటువంటి ఫలితాలను దేశానికి అందింప గలదో ఊహింపజాలము.

కావున ఈ అక్షరజ్యోతి కార్యక్రమము నిరంతరం కొనసాగాలనీ, కేవలం ఉపాధ్యాయులు, విద్యార్థులు, కొంతమంది ఉద్యోగులేగాక చదువుకున్న యువతీయువకులందరు-ముఖ్యంగా అన్ని రాజకీయ పార్టీల కార్యకర్తలు యీ మహనీయమైన కార్యక్రమంలో పాల్గొని, నిస్వార్థ భావంతో జన జాగరణకు పూనుకోవాలని ఆకాంక్ష—

# గమనిక

ఈ నాటిక ప్రధానంగా శ్రవ్య నాటిక. ఈ నాటికను వేదికపై ప్రదర్శించుటకొరకు వ్రాసినది కాదు జరుగుచున్న మహోద్యమాలను వివరించడమే లక్ష్యం!

ఇందలి కథా వస్తువు ఈ నాటిది కాదు. సారానిషేధ చట్టం రాక పూర్వం వున్న పరిస్థితులలోని విషయమని గమనింపగలరు.

మొదటి రంగంలో సారా త్రాగుటవలన చితికి పోతున్న కష్టజీవుల బ్రతుకులను వివరించడం జరిగింది.

రెండవ రంగంలో గూడెంలో రాత్రిబడి ప్రారంభాన్ని, నిర్వహణము గురించి వివరింపబడినది.

మూడవ రంగంలో జ్ఞానోదయ సమితివారు అందచేసిన మొదటి, పుస్తకంలోని విషయాలను చర్చించడం జరిగినది.

నాల్గవ రంగంలో రెండవ పుస్తకాన్ని చర్చించడం జరిగినది.

ఐదవ రంగంలో మూడవ పుస్తకంలోని ఎనిమిదవ పాఠం వరకు చర్చించి, సారాను త్రాగడం వలన రంగయ్య కుటుంబం పొందిన కష్టనష్టాలను స్మరించడం జరిగింది. తద్వార నెల్లూరు జిల్లాలో ప్రారంభమై రాష్ట్రమంతటా

అల్లుకున్న సారావ్యతిరేక మహిళా మహోద్యమాన్ని చర్చించడం జరిగింది.

ఆరవ రంగంలో మహిళా మహోద్యమం జయప్రదం కావడం, నెల్లూరు జిల్లాలో ఆనాటి నుండే సారానిషేధాన్ని అమలు జరపడం, రాష్ట్రమంతటా 1993 అక్టోబరు నుండి అమలుచేయడానికి ప్రభుత్వ నిర్ణయాన్ని ప్రకటించడము జరుగుతుంది. ప్రభుత్వ నిర్ణయఘట్టాన్ని (ఫ్లాష్‌బాక్) ద్వారా చూపబడింది.

ఏడవ రంగం-నాటికకు ప్రధాన రంగస్థలమైన గొడ్డ సావిడిలో రాత్రిబడిలో ప్రభుత్వాన్ని అభినందించుచు సభ జరుపుకోవడంతో నాటిక పూర్తవుతుంది.

ఇందులోని పాత్రలు ఎవరినీ అనుసరించినవి గాని, అనుకరించినవిగాని కావు. చిత్తశుద్ధితో మహోద్యమాల మీద వున్న మనన్నతో, గౌరవభావంతో చిత్రింపబడినవి. దీనిని శ్రవ్య నాటికగా భావించాలి.

ఇందులోని పాటలు స్వీయ రచనలు.

నాటికలో ఏమైనా అభ్యంతరకరమైన విషయము లున్నయెడల తెలియబరచిన దిద్దుకొందును. విద్యార్థులను అభినందించుటకు వ్రాసిన యీ నాటిక రసజ్ఞులను ఏ మాత్రము స్పందింప జేసినను నాకృషి ఫలించినదని భావింతును.

—రచయిత

## ఇందలి పాత్రలు

1. ప్రసాద్ (చదువుకున్న యువకుడు)
2. సుగుణ (ప్రసాద్ సోదరి)
3. కృష్ణయ్య 4. అంజయ్య (కూలీలు)
   మొదటిరంగం నుండి చివరరంగం వఱకు ఉంటారు.
5. మల్లయ్య (కూలీ)
6. గ్రామ పంచాయతీ అధ్యక్షులు
7. గ్రామాధికారి
8. మండలాధికారి (రెండవరంగంలో వస్తారు)
9. మహిళా ప్రతినిధి
10. ప్రభుత్వ ప్రతినిధి (ఆరవ రంగంలో వస్తారు)
11. గోపి 12. రాము 13. శంకర్ 14. చంద్రం
    15. సీత 16. లక్ష్మి. నిరక్షరాస్యులైన రైతుకూలీలు.

---

## కాలనిర్ణయం

1. మొదటిరంగం_నెల్లూరుజిల్లాలో సారానిషేధం అమలు చేయుటకు దాదాపు నూటపది రోజులు ముందుగా ప్రారంభమగును.
2. రెండవ రంగము_ఆ మరునాడే.
3. మూడవరంగము_మూడునెలల తరువాత జరుగును.
4. నాల్గవరంగము_ఆ మరునాడే!
5. ఐదవరంగము_పదునైదు రోజులతరువాత.
6. ఆరవ రంగము_ ఆ మరునాడే!
7. ఏడవరంగము_ఆ మరునాడు!

ఈ విధంగా నాటిక 110 రోజులలో నాటిక పూర్తియగును.

# దీపలేఖ

## (నాటిక)

(వీధి దృశ్యము) - మొదటి రంగము)

(తెర ఎత్తబడును)

[కిష్టయ్యా జగమేమాయా! అని పాడుకుంటూ ప్రవేశిస్తాడు. అంజయ్యకూడా 'అప్పన్నా తనామనా' అని పాడుకుంటూ కిష్టయ్యకు ఎదురొస్తాడు]

కిష్టయ్యా : అరే అంజిగా! ఎక్కడి నుంచిరా!

అంజయ్యా : ఎక్కడినుంచి లేదురా! మందుకొట్టు కెళ్ళి వస్తున్నాను. ఏదో ఒక పాకెట్టు ఏసుకొస్తున్నా!

కిష్టయ్యా : నేనుకూడ ఒక పాకెట్టు ఏసుకొస్తున్నా! నిషా ఏమీ ఎక్క లేదురా!

అంజయ్యా : మనలాంటోళ్ళకి ఒక పాకెట్టు నిషా ఎక్కుతుందట్రా? సరేగాని ఇయ్యాళ పనిలేదుగా! డబ్బులెక్కడియ్ రా?

కిట్టి : ఏనాటిదో మాయింట్లో ఒకరాగి సెంబు వుందిరా! దాన్ని వడ్డీల వెంకయ్యకి తాకట్టుబెడితే పదిరూపాయిలు ఇచ్చాడు!

అంజి : ఆరాగి సెంబుని అమ్ముకోలేక పోయావా? మళ్లీ ఇడిపించుకో లేవుగా!

కిట్టి : అంతేగాని ఆడదానితో వచ్చిందిరా సిక్కు! దాని పుట్టింటోళ్ళు ఇచ్చారంట ఆసెంబుని! అమ్మొద్దంది.

అంజి : అందుకని తాకట్టు పెట్టానంటావు!

కిట్టి : కూలినాలి చేసి పుట్టింటోళ్ళు ఇచ్చిన రాగి సెంబుని అదే ఇడిపించుకుంటుందిలే! మనకేం!

అంజి : మీ సంటోడికి జ్వరం వచ్చిందన్నావు! ఆడికెట్టా వుందిరా కిట్టిగా!

కిట్టి : ఎట్టావుంది? ఇవ్వాళో రేపో అన్నట్టున్నాడు!

అంజి! డాక్టేరు దగ్గిరికి తీసికెళ్ళలేక పోయావా?

కిట్టి : డాక్టేరు దగ్గిరికి తీసుకెళ్ళడానికి డబ్బు లేవిరా? సర్కారు దవాఖానాలు ఎప్పుడూ మూతబెట్టి వుండ వాయె! తెరిసున్నా మందు లుండవుగా!

అంజి! పయివేటు డాకటరు సుందరంగారి దగ్గిరికి తీసికెళ్ళ లేకపోయావా?

కిట్టి : ఆయనగారి దగ్గిరికి తీసికెళ్ళాలంటే వందలు కావాలి! వందలు ఎక్కడినుంచి తేను?

అంజి : మా సంటిదానికి కూడ రెండురోజులనుంచీ జ్వరం. మూసినకన్ను తెరవడంలేదు. డాక్టరోళ్ళ దగ్గిరికి తీసికెళ్ళడానికి మనలాంటోళ్ళకి సత్తాఏదీ?

కిట్టి : అరే అంజిగా! నీ పెళ్ళాం మెడలో ఏమీ లేదట్రా?

అంజి : మంగళసూత్రం కూడ మిగల్లేదురా! అన్నీ అమ్ముకు తాగేశా!

కిట్టి : నా పెళ్ళాం మెడలో కూడ ఏమీ లేదురా! మంగళసూత్రానికి బదులు పసుపుకొమ్ము ఏసుకుం దిరా!

అంజి : ఎవడు నేర్పాడోగాని, యీ తాగుడొకటి మహెంట

బడిందిరా! ఈ తాగుడు లేకపోతే మన బతుకులు సలక్షణంగా వుండేవి!

కిట్టి : అవునురా!

అంజి : సంపాదించిన దానిలో సగం తాగుడికే పోతా వుందిరా! ఏంచేద్దాం?

కిట్టి : నాకుమాత్రం యీ ఎదవతాగుడు మానాలనే వుందిరా! కానీ మానలేకపోతావున్నా!

అంజి : ఈ తాగుడు మనపాలిటి పిశాచంరా!

కిష్టి : నేను పొద్దున్నె ఇయ్యాల తాగనని ఒట్టేసుకుంటా నురా! కానీ పొద్దుగూకేసరికి సారాకొట్టుకో, కల్లు పాకకో పోవాలనిస్తుంది!

అంజి : నేనుకూడ అంతేరా!

కిష్టి : జేబులో డబ్బులు లేకపోతే దొంగతనమైనా చేసి తాగాలనిపిస్తుందిరా!

అంజి : ఏనాటిదో పెద్దలనాటి యి తడిబిండె మాయింట్లో వుండేది. దాన్నికూడ మూడురోజుల క్రితం అమ్ము కుని తాగేసా!

కిట్టి : నేనో! మా తాత కట్టించిన యింటినే అమ్ముకుని తాగేశా! వడ్డీల వెంకయ్య ఇంట్లోనుంచి వెళ్ళమంటు న్నాడు.

అంజి : మరి ఎక్కడికి కెళతావురా కిట్టిగా?

కిట్టి : ఎక్కడికెళతాను? నడిబజారులో కాపరం పెడతాను. లేదు మా ఆడదాన్ని, పిల్లల్ని పుట్టింటికి పంపేసి సన్యాసుల్లో కలిసిపోతాను.

అంజి : అప్పుడుమాత్రం తాగుడు మానతావట్రా?

కిట్టి : ఏమో! ఏంపాడో! ఏమవుతుందో!

అంజయ్య : ఇయ్యాళ్ళ కూలికెల్లి పగలంతా కష్టపడితే పదిహేను రూపాయలు వచ్చినయ్! ఐదురూపాయలు పొట్లానికి పోతే మిగిలిన పదిరూపాయలతో ఇంటి కెట్లా వెళ్ళనా అని ఆలోచిస్తున్నా! పదిరూపాయ లకు మానెడు బియ్యంకూడ బజార్లో రావడంలేదు.

కిట్టి : నీవు సగమన్నా ఇంటికి తీసికెళుతున్నావు! నేను అది కూడ లేదు! కూలిచేసినదంతా తాగుడికి తగలేశి నట్టిచేతులతో ఇంటి కెళతాను.

అంజి : మరి తిండెట్లారా?

కిట్టి : కూలినాలి చేసి ఆడదే ఇల్లు నడుపుతావుంది! దాని పిల్లల్ని అదే పోసించుకుంటావుంది!

అంజి : నేను చేసిన కట్టం నా తాగుడికే సరిపోతావుంది మరేం చేయను?

అంజి : మరి నీ పెళ్ళాం వూరుకుంటావుందిరా?

కిట్టి : ఊరుకోక ఏం చేసుందిరా? నా దెబ్బలకి ఓర్వలేక కుయ్యో! మొర్రో అని యేడుసుంది. వారంరోజుల కిందట పీటసెక్కతో నెత్తిమీద కొట్టాను రక్తం వరదలయి పారింది. తలకి కట్టు కట్టుకుని ఆ బాధ తోనే కూలికి పోతావుంది. కూలికెల్లకపోతే మరి తిండేది?

అంజి : అరే కిట్టిగా! ఇక సెప్పమాకు! మన సంసారాలన్నీ ఇంతేరా! మన కూలోళ్ళ బతుకులన్నీ ఇంతే.

కిట్టి : బెమ్మదేవుడు రాసిన గీతలెప్పుడు మారతాయో యేమో!

అంజి : బెమ్మదేవుడేంచాశాడురా! మన గీతలు మనమే రాసుకుంటున్నాం! మనదరిద్రాన్ని మనమే కొని తెచ్చుకుంటున్నాం!

కిట్టి : కనీసం కల్లూ—సారా దుకాణాలయినా మూయించితే కొంతవరకు మనం బాగుపడతాంరా! అదుగో! మల్లిగాడు వస్తున్నాడు.

(మల్లిగాని ప్రవేశం)

అంజి : ఏరా మల్లిగా ఎక్కడికిరా? హడావిడిగా పోతున్నావ్! మందుకొట్టుకా?

మల్లిగాడు : కాదురా! నా కూతురు సావు బ్రతుకుల్లోవుంది నల్లగొండకు పోతున్నా!

కిష్టిగాడు : ఏం జబ్బు వచ్చిందిరా?

మల్లిగాడు : జబ్బూ లేదు! గిబ్బూ లేదు!

కిట్టి : మరెందుకు?

మల్లి : ఒంటిమీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించు కుంది.

కిట్టి : ఎందుకని?

మల్లిగాడు : అత్తా ఆడబిడ్డా పోరుపడలేక!

అంజి : అత్తా ఆడబిడ్డా పోరు ఎందుకురా?

మల్లిగాడు : పెళ్ళినాడు అల్లుడికి కట్నం క్రింద రెండువేలు యిస్తానని నోరుజారాను. ఇవ్వలేకపోయాను!

అంజి : అందుకని?

మల్లిగాడు : కట్నమన్నా తీసుకురా! లేదా పుట్టింటికన్నా వెళ్ళిపొమ్మని పోరుపెట్టారు.

అంజి : మఱి ఆ కట్నం అప్పో-సప్పో చేసి యియ్యలేక పోయావా?

మల్లిగాడు : మఱి నాదగ్గరేముందిరా బూడిద? ఉన్న గుడిసె నమ్ముకోని మంగిగాడి ఇంట్లో కాపురముంటున్నా! రెండువేల రూపాయలు ఎక్కడ నుంచితేను? ఏ అయ్యా అయినా నా దగ్గర యేం చూసి అప్పిస్తాడు? ఇప్పుడు నల్లగొండ వెళ్ళడానికి బస్సు చార్జి కూడా లేదు.

అంజి : నీ కూతురు నిన్నడగాలేక-అత్తపోరు పడనూలేక యింత సాహసప్పనికి ఒడిగట్టిందనుకుంటా, యిదిగో! యీ పదిరూపాయలు తీసుకెళ్ళు! నా తిప్పలు నేను బడతాను గాని!

కిట్టి : ఇదిగో! నా దగ్గిర కూడా ఐదురూపాయలు ఉన్నయ్! ఇవికూడ తీసికెళ్ళు!

మల్లిగాడు : మీరిద్దరు నన్ను రచ్చించారు. వడ్డీల వెంక య్యను ఎంత బలిమాలినా ఇచ్చినాడు కాదు! ఏమైనా తాకట్టుబెడితే యిస్తానన్నాడు! ఏముంది అంజీ! మా యింట్లో తాకట్టు పెట్టడానికి?

కిట్టి : సరే! వెళ్ళిరా!

(మల్లిగాడు వెళ్ళిపోతాడు)

కిట్టి : (అంజితో) మన బీదోళ్ళ బతుకులు ఒక్కొక్కరిది ఒక్కొక్క కన్నీటి కథరా అంజీ!

అంజి : ఈ కన్నీటికధలు ఎప్పుడాగిపోతాయో యేమో!

(ప్రసాద్ ప్రవేశం)

ప్రసాద్ : ఏం కిష్టయ్యా! అంజయ్యా! బాగున్నారా!

కిట్టి : ఏదో ఇట్టా సావకుండా బతికున్నాం!

ప్రసాద్ : ఇద్దరు ఏదో కథలంటున్నారు?

కిట్టి : మా కన్నీటి బతుకుల కథలు ఎప్పుడాగిపోతాయా అని ప్రశ్నించుకుంటున్నాము.

ప్రసాద్ : ఎప్పుడాగి పోతయ్యో చెప్పనా కిట్టీ?

అంజి : చెప్పండి బాబూ మీరే!

ప్రసాద్ : మీ అజ్ఞానం తొలగిపోయినప్పుడు!

అంజి : మా అజ్ఞానం తొలగాలంటే మాటలా బాబూ! మీ లాంటి చదువుకున్న బాబులంతా ఉద్యోగాలు చేయడానికి పోతారుగాని మాలాంటి బీదా-బిక్కీని బాగు చేయడానికి పూనుకోరుగా బాబూ!

ప్రసాద్ : అది సరేగాని మీరు కూడ బాగుపడడానికి కొంత కృషిచేయాలి! విజ్ఞాన మనేది ఊరికెనే రాదు అంజీ! కళ్ళముందు వున్న కారుచీకట్లను తొలగించుకోవాలి! చీకటిపొదలను ఛేదించాలి! అప్పుడు బాల సూర్యుడు బంగారు కాంతులతో ఉదయిస్తాడు!

అంజి : అయితే మమ్మ్నేం చెయ్యమంటారు?

ప్రసాద్ : మీలో మార్పురావాలి! మీలో చైతన్యం జాగృతి కలగాలి! చెడును ధిక్కరించి మంచికోసం నిలబడే ధైర్యం కావాలి!

కిట్టి : అయితే అది మాకెట్టా వస్తుంది బాబూ?

ప్రసాద్ : అక్షరజ్ఞానంతో వస్తుంది! చదువుకుంటేవస్తుంది! చదువంటే వెలుగు! దానివలన మంచీచెడ్డా, లోకం పోకడ తెలుస్తుంది! ధైర్యంతో నిలబడే శక్తి నిస్తుంది!

కిట్టి : ఆ చదువు మాకెవరు నేర్పుతారు బాబూ?

ప్రసాద్ : ఈనాడు మన ప్రభుత్వం అక్షరజ్యోతి కార్యక్రమం క్రింద రాత్రి పాఠశాలలు తెరుస్తూవుంది. చదువురాని నీ వంటివారికి చదువు నేర్పుతుంది. అందుకు మీారు సిద్ధమేనా?

కిట్టి : ఈ వయసులో నేర్చుకుంటే చదువు మాకు వస్తుందా బాబూ?

ప్రసాద్ : తప్పకుండా వస్తుంది! నేను మీాకు నేర్పుతాను.

కిట్టి : అంతపెద్ద సదువులు సదువుకున్న మీారు మాకు సదువులు సెపుతారా బాబూ?

ప్రసాద్ : అవును కృష్ణయ్యా! కొన్నాళ్ళపాటు ఉద్యోగ ప్రయత్నం చెయ్యకుండా సంఘసేవ చేయాలని నిశ్చయించు కున్నాను. ఈ అక్షరజ్యోతి కార్యక్రమం మన జిల్లాలో రేపటినుంచి ప్రారంభమవుతుంది. మీాలాంటి వారికి రాత్రిబడులలో చదువు చెప్పి, మీాలో చైతన్యాన్ని, జాగృతినీ కలిగింపదలుచుకున్నాను. తరతరాలనుండి మీాలో వస్తున్న దురాచారాలను, దుర్విచారాలను తొలగింపదలుచుకున్నాను.

అంజి : మాకు పలకలు. బలపాలు, కొనే శక్తి ఎక్కడిది బాబూ!

ప్రసాద్ : మీకు పలకలు, బలపాలు, పుస్తకాలు ప్రభుత్వము ఉచితంగా ఇస్తుంది. రోజూ ఒక గంటసేపు చదువుకుంటే చాలు, జ్ఞానజ్యోతి మీకు అడుగడుగునా దారి చూపిస్తుంది.

అంజి : మీ పెద్దోళ్ళు మాకు సదువుసెప్తావుంటే వూరుకుంటారా బాబూ!

ప్రసాద్ : వారికి నేను నచ్చచెబుతాను.

కిట్టి : అయితే మేం ఎక్కడికి రావాలిబాబూ?

ప్రసాద్ : మీరెక్కడికీ రానవసరంలేదు. పలకలు, బలపాలతో నేనే మీ దగ్గరకు వస్తాను.

కిట్టి : మా వూరి గుడిసెలకు మీరు వస్తారా బాబూ?

ప్రసాద్ : అవును, మీ వూరి గుడిసెలముందే, మీ చింకి చాపలమీద కూర్చొని మీకు చదువు చెబుతాను.

కిట్టి : అంత అదృష్టమా బాబూ మాకు?

ప్రసాద్ : అయితే - మీ సహాయం ఒకటి కావాలి.

కిట్టి : మా సహాయమా? మేము మీకేమి సాయం చేయగలం బాబూ?

ప్రసాద్ : మీలాంటి చదువురాని వాళ్ళంతా ఒకచోట ప్రోగుబడి చదువుకోవడానికి శ్రద్ధ వహించాలి.

కిట్టి : మీలాంటి దొడ్డ మారాజులు మా గడపదొక్క-

మాకు సదువులు సెపుతామంటే వద్దంటామా బాబూ!

ప్రసాద్ : చదువురాని వారిసందఱిసి చదువుకుందామని ప్రోత్సహించాలి! నచ్చచెప్పాలి!

కిట్టి : అట్లాగే బాబూ! తప్పకుండా నచ్చచెబుతాం!

ప్రసాద్ : మంచిది! నేను వెళతాను! రేపు సాయంత్రం మన గూడెంలో రాత్రి బడిని ప్రారంభిద్దాం! కిష్టయ్యా! ఒకమాట చెప్పటం మరచిపోయాను! చదువురాని స్త్రీలనుగూడా రమ్మను! కలిసి చదువుకున్నందువలన తప్పులేదు. మనమంతా ఒక తల్లి బిడ్డలం.

అంజయ్య : ఆడోళ్ళకి ఎందుకు బాబయ్యా? ఈ సదువులు?

ప్రసాద్ : ఆడవాళ్ళుమాత్రం మనుషులుకారాఅంజయ్యా? ఆడవాళ్ళకుకూడా విద్య అవసరం. ఇల్లు చక్కదిద్దేది ఆడది. పిల్లల్ని పెంచి పెద్దచేసేది ఆడది. గృహాన్ని స్వర్గసీమగా మార్చేది ఆడది. కాబట్టి ఆడవాళ్ళు తప్పకుండా చదువుకోవాలి.

అంజయ్య : అట్లాగే బాబుగారూ! రేపు సాయంత్రం గూడెంలో అందరం సిద్ధంగా వుంటాం. చదువుకోవడానికి ఒక పాకకూడా సిద్ధం చేసుకుంటాం. వెళ్ళిరండి!

ప్రసాద్ : మంచిది వెళ్ళివస్తాను.

(ప్రసాద్ నిష్క్రమించును)

కిష్టయ్య : ఇటువంటి బాబులు ఊరికి పదిమంది వుంటే చాలురా! ఈ పల్లెలు ఎప్పుడో బాగుపడి ఉండేవి.

అంజి : అవునురా! కిష్టిగా! మనం తప్పకుండా సదువు కుంగాం! మన పాలిటికి దేవుడిలాగా దొరికాడు! మన ఆడోళ్ళనికూడా రాత్రి బడికి తీసుకొద్దాం!

కిట్టి : అరేయ్ అంజిగా! ఇంక మనం కల్లు పాక కెళ్ళొద్దు! సారా కొట్టు కెళ్ళొద్దు!

అంజి : ఎల్లొద్దు! ఎల్లొద్దు!

కిట్టి : రాతిరి బడికి పోదాం!

అంజి : అంతే! రాతిరి బడికి పోదాం!

కిట్టి : గూడెంలో ఆడా మొగా అందరం సదువుకుందాం!

అంజి : సదువుకుందాం!

(ఇద్దరు తెరలోనికి పోవుదురు)

తెర వాలును

మొదటి రంగము - వీధిబడి దృశ్యము సమాప్తము

— ० —

# దీపరేఖ

(నాటిక)

(రెండవ రంగము)

(రాత్రిబడి ప్రారంభోత్సవ దృశ్యం)

(తెర ఎత్తబడును)

(కొంతమంది స్త్రీలు పురుషులు కూర్చునియుందురు)

(ప్రసాద్ ప్రవేశించును)

కిష్టయ్యా, అంజయ్యాలు : (లేచి) రండి బాబుగారూ! రండి! మీ కోసమే ఎదురు చూస్తున్నాం.

అంజయ్యా : రాత్రిబడికి యీ గొడ్లసావిడిని సిద్ధం చేసుకున్నాం.

ప్రసాద్ : మంచిది! ఇలా వుండాలి పట్టుదల అంటే! ఈ రాత్రి బడిని ప్రారంభించడానికి గ్రామ పెద్దల్ని కూడా ఆహ్వానించాను. గ్రామపెద్ద, గ్రామాధికారి మండలాధికారి గారుకూడ వస్తున్నారు. వారికి తగిన యేర్పాట్లు స్వయంగా నువ్వే చెయ్యి కిష్టయ్యా!

కిష్ట : అట్లాగేనండీ బాబుగారూ!

ప్రసాద్ ; కిష్టయ్యా! నన్ను బాబుగారూ, అని పిలువకు, మనందరం ఒక్కటి. అన్నదమ్ములం! ప్రసాద్ అని పిలువు, చాలు!

కిష్ట ; అట్లాగేనండీ బాబు...కాదు ప్రసాద్ గారూ! మీలాంటి సిరిగళ్ళోళ్ళు మాపేదల గుడిసెలకు వస్తున్నారంటే మా అదృష్టం బాబూ!

ప్రసాద్ : కొండ మహమ్మదుగారి దగ్గఱకు రాళ్ళపోతే మహా

మ్మదుగా శేకొండదగ్గఱకు వెళతారు, అట్లాగే మేమూ మీా దగ్గఱకు వస్తున్నాము.

(ఊరిపెద్దల ప్రవేశం - ప్రవేశించి ఒక బల్లమీాద కూర్చుందురు)

ప్రసాద్ : (వేదికనెక్కి) మిత్రులారా! గూడెంలో రాత్రి బడి ప్రారంభిస్తున్న సమయంలో, గ్రామ పంచాయతీ అధ్యక్షులు సభకు అధ్యక్షత వహించాలనీ, గ్రామాధికారిగారు సభను ప్రారంభించాలనీ, మండలాధికారిగారు ముఖ్యఅతిథిగా ఈ సభలో పాల్గొనాలనీ, నేను ఆహ్వానిస్తూ వారిని వేదికపై ఆశీనులు కావలసిందని కోరుతున్నాను. (సభికుల నుండి హర్షధ్వనులు).

(ముగ్గురు పెద్దలు కుర్చీలపై ఆశీనులగుదురు)

(అంజయ్య వారికి పూలమాలలు వేయును)

ప్రసాద్ : అందరు కూర్చొనవలసినదిగా కోరుచున్నాను. సభను నిర్వహించవలసినదిగా గ్రామ పంచాయతీ అధ్యక్షుల వారిని కోరుచున్నాను.

ముందుగా ఒక దేశ భక్తి గీతంతో సభ ప్రారంభమవుతుంది.

(ప్రసాద్ సోదరి సుగుణ దేశభక్తి గీతమును గానము చేస్తుంది)

దేశమును ప్రేమించుమన్నా!
మంచియన్నది పెంచుమన్నా!

వట్టిమాటలు కట్టిపెట్టోయ్!
గట్టిమేల్ తలపెట్టవోయ్!
దేశమును ప్రేమించుమన్నా!
మంచియన్నది పెంచుమన్నా!

*    *    *    *

సొంతలాభం కొంతమానుకు!
పొరుగువాడికి తోడపడవోయ్!
దేశమంటే మట్టికాదోయ్!
దేశమంటే మనుషులోయ్! ॥దేశ॥

అధ్యక్షులు :

సోదరులారా! చదువు ప్రగతికి అభ్యుదయానికి మూలం. చదువు వ్యక్తి వికాసానికి ఎంతగానో తోడ్పడుతుంది. దేశానికి కూడ ఎంతో లాభం చేకూర్చుతుంది. ఆ చదువుకు దూరమైన కోట్లాది ప్రజలు అజ్ఞానపు అంధకారములో జీవిస్తున్నారు. చదువులేని సమాజంగాని, దేశంగాని అభివృద్ధిని పొందలేవు. భవిష్యత్తు వుండదు.

ఈనాడు ప్రభుత్వం ఒక నిర్దిష్ట కార్యక్రమంతో, లక్ష్యంతో ప్రజల్ని అక్షరాస్యులనుగా తీర్చిదిద్దడానికి పూనుకుంది. ఈ అవకాశాన్ని మనం వినియోగించుకుని బంగారు బ్రతుకు బాటలను నిర్మించుకోవాలని నేను కోరుతున్నాను. ప్రసాద్ లాంటి చదువుకున్న యువకుడు పెద్ద చదువు చదువుకొని, ఉద్యోగాన్ని ఆశించకుండా మన గ్రామ ప్రజలను అక్షరాస్యులనుగా తీర్చిదిద్దుటకు పూనుకున్నాడు. (హర్ష ధ్వానులు)

అతనికి నా అభివందనలు! మీరందరు అతనికి సహక రించి అతని కోరికను, మా కోరికను సఫలీకృతం జేయాలని కోరుతున్నాను. ఈ కార్యక్రమానికి నా సంపూర్ణ సహకారాన్ని అందజేయగలనని తెలుపుతూ గ్రామాధికారి గారిని యీ రాత్రిబడిని ప్రారంభింప వలసినదిగా గోరు చున్నాను. (హర్షధ్వానులు)

గ్రామాధికారి : (లేచి)

ఇచ్చటికి విచ్చేసిన గూడెము ప్రజలకు, యితరులకు నా అభివందనములు. ఈ గురుతర కార్యభారాన్ని నిర్వ హించడానికి పూనుకున్న ప్రసాద్‌కు నా అభివందనలు, ఆశీస్సులు అందజేస్తున్నాను. (హర్షధ్వానులు)

ప్రతి యొక్కరి హృదయంలో అక్షరజ్యోతి వెలిగేలా కృషిచేయ గలరని ఉపాధ్యాయులు, ఉద్యోగులు చదువు కొన్న యువతీ యువకులు అందరు ఈ కార్యక్రమంలో పాల్గొని మన గ్రామంలో ఈ కార్యక్రమం జయప్రదం చేయగలరని కోరుతున్నాను. పలకలు, బలపములు, పుస్తక ములు ఇచ్చుట ద్వార రాత్రిబడిని ప్రారంభిస్తున్నాను. (హర్షధ్వానులు) (పలకలు, బలపములు పుస్తకములు పంచి పెట్టుదురు.)

అధ్యక్షులు :

మన ముఖ్య అతిథిగా విచ్చేసిన మండలాధికారిగారు తమ సందేశాన్నిస్తారు.

అధికారి :

మిత్రులారా! ముందుగా మీ అందరికి నా అభివందనలు. అక్షరదాహంతో గుమిగూడిన మీ కందరికీ నా శుభాకాంక్షలు మన జిల్లా ప్రజలందరినీ అక్షరాస్యులుగా జేయాలని ప్రభుత్వం తలపెట్టింది. ప్రభుత్వం తలపెట్టిన యీ కార్యక్రమాన్ని జయప్రదం చేయాలి. ప్రసాద్ లాంటి చదువుకున్న యువకుడు మీకు నిర్వాహకులుగా కార్యకర్తగా, ముందుకు రావడం మీ అదృష్టం (హర్ష ధ్వానులు)

మీకు చదువుకొనుటకు కావలసిన పరికరము లన్నింటిని మీకు అందజేయగలనని ఈ దీపలేఖ కార్యక్రమాన్ని జయప్రదం చేసి, మీ బ్రతుకు బాటలను బంగారు బాటలను పయనింప జేయవలసినదిగా కోరుతూ ఇంతటితో ముగిస్తున్నాను. (హర్ష ధ్వానులు)

ప్రసాద్ : (లేచి) ఇంతటితో ఈ సభా కార్యక్రమం పూర్తి అయింది. ఈ రాత్రిబడి ప్రారంభోత్సవానికి విచ్చేసిన గ్రామ పెద్దలకు, మండలాధికారిగారికి మా పిలుపు నందుకుని వచ్చినందులకు ధన్యవాదములు, రేపటి నుండి అక్షరాస్యతా కార్యక్రమం ప్రారంభింపబడు తుంది. చదువురాని ప్రతి ఒక్కరు యీ రాత్రిబడికి రావాలని కోరుతున్నాను. ఆరు నెలలలో అక్షరాలు నేర్చుకొని ప్రభుత్వం యిచ్చిన మూడు పుస్తకాలను పూర్తి చేద్దాం. (హర్ష ధ్వానులు)

ఇప్పుడొక చదువు వెలుగు గీతంతో సభ ముగి

స్తుంది. మన గ్రామ ఉన్నత పాఠశాల విద్యార్థి రఘు ఆ పాట పాడతాడు.

దీపంతో మఱియొక దీపం
దీపింపగ వే రారండీ!
బోధనతో జన విజ్ఞానం
పులకింపగ వే రారండీ!

తరతరాల అంధకారమును
తరలింపగ వే కదలండీ!
నవసంధ్యల కాంతులు విరియగ
నవభానుడు ఉదయించాలి!

తానేమో తెలిసికోవాలీ!
తనదేమో భాసించాలీ!
సంఘంలో తాను మనిషిగా
చరియించుట నేర్చుకోవాలీ!

ఈ భూమిని జనించినా యీ
నిర్భాగ్యుల నిరక్షరాస్యుల!
అన్నదమ్ము లనిమది తెలిసీ
అక్షరజ్ఞాన మందించాలీ!

(తెరవాలును)

(రాత్రిబడి ప్రారంభోత్సవ దృశ్యము సమాప్తము)

# దీపరేఖ

(నాటిక)

(గొడ్లసావిడిలో రాత్రిబడి దృశ్యం)
(మూడవ రంగము)
(కొంతమంది స్త్రీలు, పురుషులు పలకా, బలపం, పుస్తకాలతో కూర్చొని యుందురు)
(ప్రసాద్ ప్రవేశించును)

కిష్టయ్య : రండి ప్రసాద్‌గారూ! మేమంతా నేర్చుకోవడానికి సిద్ధంగా వున్నాం!

ప్రసాద్ : గత మూడునెలలుగా మీరు అక్షరాలు అంకెలు తూకములు, కొలతలు నేర్చుకొని, రెండు పుస్తకాలు చదివారు.

కిష్టయ్య : అందులోని పాఠాలుకూడ చదివాం.

ప్రసాద్ : కేవలం మనం అక్షరాలు, అంకెలు మాత్రమే చదవడం కాదు. అందులోని విషయాలు మనం వంట బట్టించుకోవాలి.

అంజయ్య : అంటే!

ప్రసాద్ : మనం చదివిన విషయాలు మన జీవితాలకు అన్వయింప జేసుకుని వాటిని ఆచరణలోనికి తేవాలి.

కిష్టయ్య : అదెట్లా బాబూ?

ప్రసాద్ : ఉదాహరణకు మొదటిపుస్తకంలో నాల్గవపాఠం చూడండి. రాము! అందులో ఏముంది?

రాము : జనం ముందుకు నడుస్తున్నారు.
ఒక పురుషుడు, ఒక స్త్రీ చేతులెత్తారు.

ప్రసాద్ : క్రిందవున్న అక్షరాలను అంజీ! నీవు చదువు.
అంజయ్య : జనం కలవడం జనం పలకడం.
ప్రసాద్ : ఏదైనా పనిని సాధించదలుచుకుంటే జనమంతా కలవాలి! ఒకేమాట పలకాలి. అప్పుడే మనం యేపనినైనా సాధించగలుగుతాం.
అంజయ్య : అవును ప్రసాద్ గారూ! ఆమాట నిజమే.
ప్రసాద్ : ఆఅవ పాఠం చూడండి. ఏముంది అందులో? నువ్వు చెప్పు లక్ష్మీ!
లక్ష్మి : సూర్యోదయ మవుతుంటే జనం పనులు చేసుకుంటున్నారు.
ప్రసాద్ : గ్రామం ఎలావుంది?
లక్ష్మి : పరిశుభ్రంగా వుంది.
ప్రసాద్ : ఆవిధంగానే మన గ్రామాలుకూడ పరిశుభ్రంగా క్రమబద్ధంగా వుంచుటకు యత్నించాలి.
కిష్టయ్య : అవును ప్రసాద్ గారు. మన గ్రామాలు కూడ ఆవిధంగానే వుంచుటకు ప్రయత్నించాలి.

* * * *

ప్రసాద్ : ఏడవపాఠం చూడండి. అందులో ఏముంది? గోపీ నువ్వు చెప్పు.
గోపి : నలుగురుపిల్లలు ఆడుతూ పాడుతూ గంతులేస్తున్నారు.
ప్రసాద్ మీ పిల్లలుకూడ అదేవిధంగా ఆడుతూ పాడుతూ సంతోషంగా ఉండాలి.
కిష్టయ్య : అంతభాగ్యమా బాబూ మాకు?

ప్రసాద్ : ప్రయత్నిస్తే తప్పకుండా ఆ భాగ్యమొస్తుంది.

* * * *

ప్రసాద్ : ఎనిమిదో పాఠంలో ఏముంది? అంజయ్యా. నువ్వు చెప్పు?

అంజయ్య : ఒక కూలీ సంతకం చేస్తున్నాడు.

ప్రసాద్ : మరి మీరందరు సంతకాలు పెట్టడం నేర్చుకున్నారుగా!

అంజయ్య : మీరే నేర్పారుగదా! సంతకాలు మాకు?

ప్రసాద్ : ఇదివరకు ఏంచేస్తూ వుండేవారు?

అంజయ్య : వేలిముద్రలు వేస్తూవుండేవారం.

ప్రసాద్ : మరి యిప్పుడో.

అంజయ్య : సంతకాలు చేస్తున్నాం.

* * * *

ప్రసాద్ : సీతా, నువ్వు చెప్పమ్మా. తొమ్మిదవ పాఠంలో ఏం చూస్తున్నారు?

సీత : ఇక్కడ మేం చదువుచున్నట్లే ఆడా-మొగా అంతా కలిసి చదువుకుంటున్నారు.

ప్రసాద్ : అట్లాగే మీరంతా సిగ్గుపడకుండ చదువుకోవాలి. మనమంతా ఒక తల్లిబిడ్డలులాగ కలిసి మెలిసి ఉండాలి.

* * * *

ప్రసాద్ : పదవ పాఠంలో ఏం చూస్తున్నావ్ గోపీ?

గోపి : చీమలన్నీ కలిసి ఒక పెద్ద పామును కదలకుండా పట్టుకున్నాయి.

ప్రసాద్ : ఈ పాఠం నుండి నీవు యేమి నేర్చుకున్నావు?
గోపి! 'సంగం బలం' అని తెలుసుకున్నాను. అందరు కలిసి ఎంతపనైనా సాధించవచ్చునని తెలుసుకున్నాం.
ప్రసాద్ : ఇంతకూ ఈ ప్రశ్నలవలన మీరు బాగా చదువ గలుగుతున్నారు. వ్రాయగలుగుతున్నారు. ఔనా కిష్టయ్యా.
కిష్టయ్య : ఔను బాబుగారూ! బాగా చదువగలుగుతున్నాం! వ్రాయగలుగుతున్నాం.

*　*　*　*

ప్రసాద్ : పన్నెండో పాఠంలో ఏం చూస్తున్నారు? లక్ష్మి నువ్వు చెప్పు?
లక్ష్మి : మంచంమీద పసిపాప, కూర్చున్న ఒక బాలింత రాలు, కూరలు, పండ్లు, పాలు చూస్తున్నాం.
ప్రసాద్ : ఈ పాఠం ద్వార యేం తెలుసుకున్నారు?
లక్ష్మి : బాలెంతరాలు మంచితిండి తినాలనీ, దానిద్వార పుట్టిన పసిపాపకు చాలినన్ని పాలుదొరుకుతాయనీ తెలుసుకున్నాం. పాలు, పండ్లు, కూరగాయలు బాలెంతకు ఇవ్వాలని తెలుసుకున్నాం.

*　*　*　*

ప్రసాద్ : పదమూడవ పాఠంలో ఏం చూస్తున్నావు కృష్టయ్యా?
కిష్టయ్య : నాలాంటి పేదవాని కుటుంబాన్ని చూస్తున్నాను బాబుగారూ. ఒక ముసలితల్లి, భార్య, ఇద్దరు పిల్లల్తో వున్న ఒక వ్యవసాయకూలీని చూస్తున్నాను.

ప్రసాద్ : ఆపాఠం ద్వారా ఏం తెలుసుకున్నావ్ కృష్ణయ్యా.

కిష్టయ్యా : మన బతుకులు మారాలనీ, అందరికీ పని కావాలనీ, అందరి అవసరాలు తీరాలనీ, ఊరూవాడా బాగుపడాలనీ తెలుసుకున్నాం.

*　　*　　*　　*

ప్రసాద్ ; పదునాల్గవ పాఠంలో ఏం చూస్తున్నావు.
అంజయ్యా! నువ్వు చెప్పు.

అంజి : ఎనిమిదిమందిపిల్లలు తల్లి చుట్టూ ఈగల్లాగ ముసురుకొని వున్నారు?

ప్రసాద్ : తండ్రి ఏం చేస్తున్నాడు?

అంజి : మంచంమీద కూచుని విచారిస్తున్నాడు!

ప్రసాద్ : ఈ పాఠంవలన మీరు ఏమి నేర్చుకున్నారు?

అంజి : పండినపంట తిండికి చాలదనీ, అందుకే సంతానం మితంగావుంటే బాగుంటుందనీ తెలుసుకున్నాం!

*　　*　　*　　*

ప్రసాద్ : పదిహేనవ పాఠంలో ఏం చూస్తున్నావు రామూ?

రాము ; ఒక మహమ్మదీయ వృద్ధుణ్ణి ఒక హిందూ యువకుడు ఏరు దాటిస్తున్నాడు?

ప్రసాద్ : ఈ పాఠంవలన మనం నేర్చుకున్న దేమిటి?

రాము : మతం ఏదయినా, కులం ఏదయినా ఇరుగు పొరుగు వారితో కలిసి యుండాలనీ, పొరుగువారికి తోడు పడాలని నేర్చుకున్నాం!

*　　*　　*　　*

ప్రసాద్ : పదహారవపాఠంలో ఏం చూస్తున్నావు గోపీ?
గోపీ ; తల్లి కొడుకుని బడికి పంపిస్తూ వుంది.
ప్రసాద్ : మరి బాలికనో?
గోపి : బడికి పంపకుండా అంట్లు తోమిస్తూ వుంది.
ప్రసాద్ : ఆ పాఠంవలన నేర్చుకునేదేమిటి?
గోపి : కొడుకయినా, కూతురయినా ఒకటేననీ, ఇద్దరినీ బడికి పంపించి చదువు చెప్పించాలనీ నేర్చుకున్నాం. తెలివితేటలలో పనిపాటలలో ఆడామగా సమానమే గదా!

* * * *

ప్రసాద్ : పదునేడవ పాఠంలో యేం చూస్తున్నావ్ కృష్ణయ్యా?
కిట్టి : ఒక సంసారం ఆనందంతో కలకలలాడుతున్నది! ఒక సంసారం కష్టపడుతున్నట్లు కనబడుతున్నది.
ప్రసాద్ : దానికి కారణం?
కిట్టి : సోమరితనంవలన దరిద్రం. పనిచేయడంవలన ఆనందం! గౌరవం!

ప్రసాద్ : మరి అందరికీ పనివుందా?
కిట్టి : లేదు!
ప్రసాద్ : మరి తగినంత కూలి వుందా?
కిట్టి : లేదు!
ప్రసాద్ : దానికి కారణం?
కిట్టి : నాకు తెలియదు!
అంజి : నేను చెబుతా । ప్రసాద్ గారూ?

ప్రసాద్ ; మరి చెప్పు చూద్దాం!

అంజి : దానికి కారణం సమాజం, దాని వ్యవస్థ.

ప్రసాద్ ; మరి మనం ఏం చేయాలి?

అంజి ; మనం ముందు మారాలి! మన సమాజాన్ని మార్చ దానికి ప్రయత్నించాలి.

ప్రసాద్ : ఇవ్వాళిటికి మొదటి పుస్తకాన్ని పరిశీలించాం. రేపు రెండవ పుస్తకాన్ని పరిశీలిద్దాం! ఇంక సెలవు!

తూరుపు వాకిలి కుంకుమ కాంతులు తొలకాలీ!
పల్లె సీమలను వెలుగు దీపికలు వెలగాలీ
అక్షరజ్ఞానం అందరుపొందీ
ఆనందం ధరనిండాలీ!
విజ్ఞానపు చైతన్య జాగృతులు
విమలత్వము వికసించాలీ!

రాత్రిబడులలో రమ్య పాఠకులు
రాగధ్వనులతో నిండాలీ!
బ్రతుకుబాటలో బంగారుకాంతుల
బాలభాను డుదయించాలి!

తూరుపు వాకిలి కుంకుమకాంతులు తొలకాలీ!
పల్లెసీమలను వెలుగుదీపికలు వెలగాలీ!

(తెర వాలును)

(గొడ్ల పావిడిలో రాత్రి బడి దృశ్యము మాత్రము)

# దీ ప లే ఖ

(నాటిక)

(నాల్గవ రంగము)

(గోడ్ల సావిడిలో రాత్రిబడి దృశ్యము)

(మూడవ రంగంవలెనే కొంతమంది స్త్రీ, పురుషులు పలకా, బలపం, పుస్తకాలతో కూర్చుని యుందురు)

(ప్రసాద్ ప్రవేశించును)

(అందరూ లేచి నిలుచుందురు)

కిట్టి : నమస్కారమండీ ప్రసాదుగారూ!

ప్రసాద్ : నమస్కారం! అందరూ కూర్చోండి! ఇంక పాఠాలు మొదలుపెడదామా అంజయ్యా!

అంజి : బాబుగారూ! మేమంతా సిద్ధంగా వున్నాం.

ప్రసాద్ : నిన్నటిరోజున మనమేమి చేశాం కిష్టయ్యా?

కిట్టి : గత మూడు నెలలలో చదివిన పుస్తకాలలో మొదటి పుస్తకాన్ని పరిశీలించాం! చదివిన విషయాలను జీవితానికి అన్వయించుకోవాలని చెప్పారు.

ప్రసాద్ : సరే! ఇవ్వాళ రెండవ పుస్తకాన్ని పరిశీలిద్దాం రెండవ పుస్తకంలో మొదటిపాఠంలో ఏం చూస్తున్నారు? నువ్వుచెప్పు లక్ష్మి?

లక్ష్మి : ఒక తల్లి తన బిడ్డను ఎత్తుకొని లాలనచేస్తూ వుంది, ఒక పాప తన తల్లిని రెండు చేతులతో పట్టుకుని నిలుచుని వుంది.

ప్రసాద్ : ఆ బొమ్మ క్రింది అక్షరాలను నువ్వు చదువు సీతా.

సీత : పసిబిడ్డలు లేత మొగ్గలు అని వుంది.

ప్రసాద్ : పసిబిడ్డలకు ఏం కావాలి?

సీత : పసితనం ఎంతో అందమైంది, ఆ సమయంలో వారికి లాలన కావాలి. ఆటలు కావాలి. ఆదరం, తిండీ, మంచి చదువూ కావాలి.

ప్రసాద్ : అందరి పిల్లల కవి దొరుకుతున్నవా?

సీత : లేదు!

ప్రసాద్ ; ఎందువలన?

సీత : దారిద్రంవలన!

ప్రసాద్ . ఆ దరిద్రానికి కారణం?

సీత : సమాజ వ్యవస్థ! ముందుగా మనం మారాలి! సమాజాన్ని మార్చాలి.

* * * *

ప్రసాద్ : రెండవ పాఠం పేరు చెప్పు అంజయ్యా!

అంజీ : రైతు వచ్చన ఊరు పచ్చన!

ప్రసాద్ : అంటే?

అంజయ్య : రైతు పచ్చగావుంటే ఊరు పచ్చగా వుంటుందని?

ప్రసాద్ : అంటే?

అంజి : పంటలే మన సంపదలు. పంటలు పండించే రైతు పచ్చగా వుండాలి. పంటకు తగిన గిట్టుబాటు ధరలు వుండాలి! రైతు అప్పులపాలు కాకూడదు! పని

చేసే వారందరికీ పొలం వుండాలి. అప్పుడే తగిన పని వుంటుంది. దానివలన ఊరంతా పచ్చగా వుంటుంది.

* * * *

ప్రసాద్ : మూడవపాఠంలో ఏం చూస్తున్నారు? నువ్వు చెప్పమ్మా లక్ష్మి!

లక్ష్మి : ఒక బాలుడు చెట్టు నాటుతున్నాడు. ఒక బాలిక నీళ్ళు పోస్తూవుంది.

ప్రసాద్ : చెట్లు ఎందుకు నాటాలి?

లక్ష్మి : వానలు తగ్గిపోయాయి. ఎండలుమండిపోతున్నాయి. వరదలువచ్చి నేల కొట్టుకుపోతూవుంది. అడవులు నరికి వేయడంవలననే యిట్లా జరుగుతున్నది.

ప్రసాద్ : మరి మనం ఏం చేయాలి?

లక్ష్మి : అడవులను నరికివేయడం మానివేయాలి. ఒక చెట్టు నరికితే పది మొక్కలు నాటి పెంచాలి.

* * * *

ప్రసాద్ ; నాల్గవపాఠములో ఏం చూస్తున్నారు? నువ్వు చెప్పు రామూ?

రాము : ఒక తల్లి తన బిడ్డకు పాలు ఇస్తూ వుంది.

ప్రసాద్ : పసిబిడ్డకు తల్లిపాలు మంచిదనీ, తల్లి పాలకంటే బిడ్డకు లోకంలో బలమైంది లేదనీ, రోగాలు రాకుండా కాపాడుతుందనీ తెలిసికున్నాం.

ప్రసాద్ : మరి యింకా ఏమి తెలుసుకున్నారు?

రాము : తల్లులందరి దగ్గర బిడ్డకు చాలినన్ని పాలు ఉంటా

యనీ, అయితే వారు మంచి బలవర్థక ఆహారాన్ని తీసుకోవాలని తెలుసుకున్నాం.

* * * *

ప్రసాద్ : ఐదో పాఠంలో ఏముందో అంజయ్యా! నువ్వు చూడు.

అంజి : కొంతమంది ఆడా-మగా కలిసి మాలాగే రాత్రి బడిలో చదువుకుంటున్నారు.

ప్రసాద్ : అయితే అంజయ్యా! ఆ పాఠంతో ఏం తెలిసి కున్నావ్?

అంజి : ఈనాడు మనిషి తెలివితేటలు సైకిలునుండి రాకెటు దాకా వెళ్ళిందనీ, ఆనకట్టలు, మిద్దెలు, మేడలు, కట్టడాలు, కట్టినవేయని తెలిసికొన్నాం! శ్రమజీవుల చెమట వలన పుట్టినవని తెలిసికొన్నాం.

ప్రసాద్ : అందరికీ ఆ సంపదలు ఎందుకు దక్కడం లేదు.

అంజి : కొందరిలాగా మేముకూడా బడికి పోలేకపోయామనీ చదువుసంధ్యలు లేకపోవడంవలన దిక్కుమాలిన దరిద్రం వెంటబడిందనీ, చీకటి బతుకులయ్యాయని తెలుసుకున్నాం.

ప్రసాద్ : ఈ చీకటి బతుకులోనుంచి బయటపడాలంటే ఏం చేయాలనుకుంటున్నావు అంజయ్యా?

అంజి : వెలుతురనే చదువు కావాలి? ఎలా బ్రతకాలో నేర్పేదే చదువు. లోకాన్ని తెలుసుకోవచ్చు. పేదరికానికి మూలం తెలుసుకోవచ్చు. అందరు కలిసి

దరిద్రానికి మూలమైన దానిని ఎదిరించవచ్చని తెలుసుకున్నాం.

ప్రసాద్ ; అంజీ! నీకు పాఠం బాగా అర్థం అయింది. రాత్రిబడికి రావడంవలన నీకెంతటి ఆలోచనా శక్తి గలిగిందో చూడు?

అంజయ్యా : అవును బాబూ! చదువువలన లోకం పోకడ తెలుస్తావుంది.

*   *   *   *

ప్రసాద్ : నువ్వు చెప్పరా గోపీ! ఆటవపాఠంలో ఏం చూస్తున్నావ్?

గోపి : ఒక ఆడ కూతురు ఓట్ల డబ్బాలో తన ఓటు వేస్తావుంది.

ప్రసాద్ : ఇంకేం చూస్తున్నారు?

గోపి : రెండువైపులా రెండు పార్టీలవారు ఓటు తమకే వేయమని నినాదాలు చేస్తున్నారు.

ప్రసాద్ : ఈ పాఠంవలన మన మేం తెలుసుకున్నాం?

గోపి : జనం కోర్టులో ఓటు తీర్పులాంటిదని, తెలుసుకున్నాం.

ప్రసాద్ : ఓటు వేయడమంటే ఏమిటి?

గోపి : ఓటు వేయడమంటే మనమిచ్చే తీర్పు! మనం కోరుకునే మార్పు.

ప్రసాద్ : ఎటువంటి వారిని మనం ఎన్నుకోవాలి?

గోపి : జనంలో పనిచేసే వారిని ఎన్నుకోవాలి. మంచికి ఓటివ్వాలి. నోటుకు అమ్ముడుపోతే మనకే చేటు.

చేప్పే చట్టాలు చేసి పరిపాలించేది మనం ఓటు వేసి గెలిపించేవారే. ఈ చట్టాలతోనే! పరిపాలనతోనే మన బతుకులు ముడిపడివుంది.

ప్రసాద్ : ఓటు వేసేటప్పుడు ఎలా వుండాలి?

గోపి : ఎవరికీ జంకకూడదనీ, అందరు ఒకటిగా నిలబడాలనీ, మంచిని దగ్గఱకు తీయాలనీ, చెడ్డవారిని దూరంగా వుంచాలని తెలుసుకున్నాం!

ప్రసాద్ : ఓటరు ఎలాంటివాడు?

గోపి : జడ్జి వంటివాడు?

ప్రసాద్ : ఓటు ఎలాంటిది?

అంజి : జనంకోర్టులో తీర్పులాంటిది!

ప్రసాద్ : గోపీ పాఠాన్ని చక్కగా అర్థం చేసుకున్నావ్!

* * * *

ప్రసాదు : కిష్టయ్యా! ఏడవ పాఠంలో ఏం చూస్తున్నావ్?

కిష్టయ్య ; ఒక ఆడకూతురు దూరంగా నిలబడి ఒక పిల్ల వాడి దోసిట్లో నీళ్ళు పోస్తా వుంది!

ప్రసాద్ : అలా ఎందుకు చేస్తూవుంది?

కృష్ణయ్య : ఆ పిల్లవాడు అంటరానివాడని!

ప్రసాద్ : పైనవున్న బొమ్మలో ఏం చూస్తున్నావ్?

కృష్ణయ్య : ఆ పిల్లవానికే చేతికి మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ వుంది!

ప్రసాద్ : అంటరానితనం మంచి తనమేనా?

కృష్ణయ్య : కాదు! ఒక దురాచారమని తెలుసుకున్నాం!

ప్రసాద్ : ఈ పాఠం వలన మనం తెలుసుకున్నదేమిటి?

కృష్ణయ్య : కులంలో ఏమీ లేదనీ, మానవులంతా ఒకటే ననీ, అంటరాని తనం ఒక దురాచారమనీ తెలుసుకున్నాం.

ప్రసాద్ : మన రాజ్యాంగ చట్టాన్ని నిర్మించిందెవరో తెలుసా?

కృష్ణయ్య : అంటరాని కులంలో జన్మించిన అంబేద్కర్.

* * * *

ప్రసాద్ : ఎనిమిదవ పాఠం వలన తెలిసికున్నదేమిటి నువ్వు చెప్పు లక్ష్మి!

లక్ష్మి : ఈరోజుల్లో తల్లిదండ్రులకు ఆడపిల్ల పెళ్ళి పెద్ద సమస్య అయిందనీ, వేలకువేలు కట్నాలు ఇవ్వవలసి వస్తున్నదనీ తెలుసుకున్నాం!

ప్రసాద్ : ఇంకేమి తెలుసుకున్నావు?

లక్ష్మి : చట్టం ప్రకారం కట్నం ఇవ్వడం నేరమనీ, తీసుకోవడం కూడ నేరమని తెలుసుకున్నాం. ఈ వరకట్న దురాచారానికి ఎంతోమంది ఆడపిల్లలు బలి అవుతున్నారనీ, ఇది మనకు సిగ్గు చేటనీ తెలుసుకున్నాం!

ప్రసాద్ : ఇంకేమి తెలుసుకున్నాం?

లక్ష్మి : పద్దెనిమిది యేండ్లు దాటాకనే పెళ్ళి చేయాలనీ, వారికి ఆలోచించుకునే వయస్సు రావాలనీ తెలిసికొన్నాం! తల్లిదండ్రుల ఆస్తిలో వారికి ఆస్తిహక్కు ఉండాలనీ తెలిసికొన్నాం!

ప్రసాద్ : ఇంకేం తెలుసుకున్నారు?

లక్ష్మి : కట్నం పేరుతో అన్యాయం జరిగితే స్త్రీలు ఎదుర్కోవాలనీ, మనం వారికి తోడుగా నిలబడాలనీ తెలిసికొన్నాం!

ప్రసాద్ : ఇక్కడున్న సభ్యులంతా వారికి తోడుగా నిలబడానికి సిద్ధమేనా?

అందరు : మేమంతా సిద్ధంగా వుంటాం!

* * * *

ప్రసాద్ : తొమ్మిదవ పాఠంలో ఏం చూస్తున్నావ్? నువ్వు చెప్పు చంద్రం!

చంద్రయ్య : ఒక ఆరోగ్యవంతమైన కుటుంబం పొలంనుంచి ఇంటికి వస్తూ వుంది!

ప్రసాద్ : చంద్రం! ఆరోగ్యం ఎలాంటిది?

చంద్రయ్య : మన భాగ్యం లాంటిది.

ప్రసాద్ : చాలా జబ్బులు ఎలా వస్తవి?

చంద్రయ్య : నీటివలన!

ప్రసాద్ : చెరువులు, గుంటలు, కాలువల నీరు త్రాగ వచ్చునా?

చంద్రం : త్రాగకూడదు! బాగాకాచి చల్లార్చిన నీరు త్రాగాలి!

ప్రసాద్ : అలా చేస్తే ఏం జరుగుతుంది?

చంద్రం : రోగాలు దగ్గరికి రావు!

ప్రసాద్ : ఇంకా ఈ పాఠం వలన ఏమి తెలుసు కున్నావు?

చంద్రం : ఈగల, దోమలవలన రోగాలు వస్తాయనీ, ఇల్లూ, వాకిలీ, వీధి, శుభ్రంగా వుంచుకోవాలనీ, ఇంట్లోకి

గాలి, వెలుతురు రావాలనీ, రోజూ స్నానం చేయాలనీ తెలుసుకున్నాం!

ప్రసాద్ : చంద్రం! ఇంకా ఏమి తెలుసుకున్నావు?

చంద్రం : పిల్లలకు సరియయిన కాలంలో టీకాలు వేయించాలనీ, అందరూ పౌష్టిక ఆహారాన్ని తీసుకోవాలనీ, కాఫీ, టీ, సిగరెట్టు, బీడీ, పొగాకు మంచివిగావనీ తెలిసికొన్నాం!

ప్రసాద్ : ఈ మాత్రం జాగ్రత్తలు వహిస్తే ఏం జరుగుతుంది?

చంద్రం : ఏ జబ్బులూ లేకుండా ఆనందంగా బ్రతకొచ్చని తెలుసుకున్నాం!

* * * *

ప్రసాద్ : పదవ పాఠంలో ఏం చూస్తున్నావ్?
అంజీ! నువ్వు చెప్పు!

అంజి : భారతదేశపు పటము, ఆ పటమునిండా అనేక మతాలకు చెందిన (స్త్రీ) పురుషులను చూస్తున్నాను!

ప్రసాదు : ఆ పటము క్రింద ఏమని వుంది?

అంజి : దేశమంటే మట్టికాదోయ్!
దేశమంటే మనుషులోయ్!
అనే అక్షరాలతో కూడిన పాటను చూస్తున్నాను!

ప్రసాదు : ఆ పాటను వ్రాసినదెవరో తెలుసా?

అంజి : గురజాడ అప్పారావుగారు!

ప్రసాదు : పాటను కంఠస్థం చేశావా?

అంజి : చేశాను ప్రసాదుగారూ!

ప్రసాదు : ఈ చర్చలవలన, బోధనవలన దేశానికి, ప్రజలకు ఎంతో మేలుగలుగు తుందని తెలుసుకున్నాం. ఇందుకు మీరే నిదర్శనం! మీలో ఎంతో మార్పు వచ్చిందని తెలుసుకున్నాను.

కృష్ణయ్య : అవును బాబుగారు! మీ కృషి ఫలితంగానే మేము కొంత తెలివిని సంపాదించాం!

ప్రసాదు : ఈ నాటితో యీ రాత్రి బడులు మొదలుపెట్టి మూడు నెలలయింది! రేపటినుంచి మూడవ వాచకం మొదలు పెడదాం!

(తెరవాలును)

(నాల్గవ రంగం రాత్రిబడి దృశ్యం పూర్తి)

# దీ ప లే ఖ

(నాటిక)

(ఐదవ రంగము)-గొడ్లసావిట్లో రాత్రిబడి దృశ్యం)

తెర ఎత్తబడును

(పూర్వపు రంగము వలెనే కొంతమంది స్త్రీ పురుషులు పలకా, బలపం, పుస్తకాలతో కూర్చుని యుందురు)

(ప్రసాద్ ప్రవేశం)

(అందరు లేచి నమస్కరింతురు)

ప్రసాద్ : నమస్కారం! అందరు కూర్చోండి!

(అందరు యథాప్రకారం కూర్చుందురు)

ప్రసాద్ : మనం మూడో పుస్తకం చదవడం మొదలు పెట్టి పదిహేను రోజులయింది. ఇంతవరకు జరిగిన పాఠాల నన్నిటిని ఒకసారి పరిశీలించుదాం!

కృష్ణయ్య : అట్లాగేనండి ప్రసాద్ బాబుగారూ!

ప్రసాద్ : మొదటిపాఠం మీరేం చూస్తున్నారు? రామూ! నువ్వు చెప్పు?

రాము : ఒక గ్రామాన్ని చూస్తున్నాం! ఒక గొడ్లకాడి పోరగాడు గొడ్లను తోలుకెళుతున్నాడు! ఒక పిల్లవాడు చక్కగా తలదువ్వుకొని పుస్తకాల సంచీతో బడికి పోతున్నాడు! ఒకావిడ అంట్లు తోముతూ వుంది. ఒక బాలిక గోడకు పిడకలు గొడుతూవుంది. కొంతమంది తమ యిళ్ళముందు మంచాలమీద, నేల మీద కూర్చుని ఉన్నారు.

ప్రసాద్ : ప్రొద్దుపొడుస్తూ వుంది! ప్రాలుతూవుంది! వెలుతురు చీకట్లు రావడానికి కారణాలు తెలుసుకున్నారు గదా!

రాము : తెలిసికున్నాం ప్రసాద్‌గారు! భూమి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ తిరగడం వలన ఈ మార్పులు జరుగుతున్నాయని తెలిసికొన్నాం!

ప్రసాద్ : మేఘాలు ముసురుకొనడానికి, వానలు కురవడానికి, తుఫానులు రావడానికి, నదులు పొంగడానికి, కారణాలు తెలిసికున్నారా?

రాము : తెలిసికొన్నాం ప్రసాద్‌గారూ!

ప్రసాదు : ఎలా తెలిసికొన్నారు?

రాము : ప్రశ్నల ద్వారా?

ప్రసాదు : ప్రశ్నలు లేకపోతే జవాబులు వచ్చేవా?

రాము : వచ్చేవికావు! ప్రశ్న చాల ముఖ్యమని తెలిసికొన్నాం!

ప్రసాదు : మనిషికి తన బ్రతుకును గురించి యేమని ప్రశ్నలు వచ్చాయి?

రాము : ఒకరి పెత్తనం క్రింద ఒకరు ఎందుకు బ్రతకాలి? అనుకున్నాడు.

ప్రసాదు : తరువాత ఏం జరిగింది?

రాము : రాజులు పోయారు! రాజ్యాలు పోయాయి!

ప్రసాదు : ఈనాడు ఎటువంటి రోజులు వచ్చాయి!

రాము : మనుష్యులంతా సమానమే అనేరోజులు వచ్చాయి!

ప్రసాదు : ఇంతకూ యీ పాఠంద్వార ఏమి తెలుసు కున్నారు?

రాము : ప్రశ్న చాలా ముఖ్యమనీ, ప్రశ్నద్వారా జవా బులు వెదకాలని తెలిసికున్నాం!

*     *     *     *

ప్రసాదు : గోపీ! మూడవ పాఠంలో ఏమి చూస్తున్నావు?

గోపి ; రామాపురం అనే గ్రామాన్ని చూస్తున్నాను!

ప్రసాదు : గ్రామం ఎట్లావుంది!

గోపి : పరిశుభ్రముగా ఆదర్శప్రాయంగా వుంది. గ్రామ పంచాయతీ ఆఫీసు, పాఠశాల, ఎలక్ట్రిసిటీ లైట్లు, మున్నగువానితో ఎంతో చక్కగా వుంది.

ప్రసాదు : పాఠంద్వార ఏమి తెలుసుకున్నావు గోపీ?

గోపి : ఊరి ప్రజలంతా ఒక్కమాటమీద ఉంటారనీ, ఊరి బాగుకోసం ముందుంటారని తెలిసికొన్నాం!

ప్రసాదు : మఱి ఆవూరికి ఏమేమి వున్నాయి?

గోపి : ఆ వూరిలో వీధి వీధికీ మంచినీళ్ళ బోరింగుబావు లున్నాయి. వీధివీధికీ వీధిదీపాలున్నాయి మురుగునీటి కాలువలున్నాయి! ఆసుపత్రి వుంది. బడివుంది! ఊళ్ళోకి బస్సు వస్తుంది. ఈమధ్యనే ఊళ్ళో అంద ఱికీ చదువు చెప్పాలని యువకులు ప్రతిజ్ఞ చేశారనీ, రాత్రి బడులు పెట్టారనీ తెలుసుకున్నాం!

ప్రసాదు : ప్రజలంతా పూనుకుంటే ఏమవుతుంది?

గోపి : ప్రతిఊరూ రామాపురంలాంటి గ్రామమవుతుంది.

ప్రసాదు : గ్రామానికి రోజ్‌గార్ డబ్బువచ్చినప్పుడు ఏం చేయాలి?

గోపి : గ్రామ సభ జరుపుకుని, అందరూ పాల్గొని, ఊరి అవసరాలను గురించి మాట్లాడుకోవాలి.

ప్రసాద్ ; ఇంకా ఏమి తెలుసుకున్నారు?

గోపి : కులమత కొట్లాటలు జరిగితే, ఊరికి మంచిదికాదనీ, మంచివారినే పంచాయతికి ఎన్నుకోవాలనీ తెలిసికొన్నాం.

ప్రసాద్ : ఇంతకూ ఊరి బాగు ఎవరి చేతిలో వుంది.

గోపి । మన ఊరి బాగు మనచేతిలోనే వుందనీ, ఊరుబాగుపడితే మనం బాగుపడతామనీ, ఊళ్ళో సదుపాయాలుంటే మనం సుఖపడతామనీ తెలుసుకొన్నాం.

ప్రసాద్ : గోపీ! నీకీపాఠం చక్కగా అర్థమయిందని ప్రశంశిస్తున్నాను.

గోపి / అర్థమవడమేకాదు ప్రసాదుగారూ! రేపు రాబోయే పంచాయతీ ఎన్నికలలో నేను సభ్యునిగా నిలిచి గ్రామ సేవ చేయాలనుకుంటున్నాను.

ప్రసాద్ ; ఈ పాఠం చదివినందువలన నీకీ జాగృతి కలిగిందని భావిస్తున్నాను.

గోపి : అవును ప్రసాదుగారూ!

* * * *

ప్రసాద్ : నాల్గవపాఠం పేరు ఏమిటి చంద్రం!

చంద్రం : మూగజీవాలు.

ప్రసాదు । మూగజీవాలు అనే పాఠంలో నువ్వేం చూస్తున్నావు చంద్రం.

చంద్ర ; ఒక ఉడత, ఎద్దు, గేదె, తొండ, కప్ప, పాము చూస్తున్నాం. ఒక మనిషి ఒక చెట్టును నరికేస్తున్నాడు.

ప్రసాదు : ఆ మూగజీవాలు ఏమనుకున్నవి?

చంద్ర ; మనిషి ప్రకృతినంతా సర్వసంహారం చేస్తున్నాడనీ, తమకు శత్రువనీ భావించినవి.

ప్రసాదు ; తరువాత ఏమనుకున్నవి?

చంద్ర ; మానవుడు తన తప్పును గ్రహించాడనీ, ప్రకృతి లేనిదే తాను జీవించలేనని తెలుసుకున్నాడనీ, కావున మానవుడు తమకు శత్రువు కాదనీ, మిత్రమని తెలిసికున్నారు.

ప్రసాదు : మరి మనమూ ప్రకృతీ కలిసియుంటేనేగదా లోకం పచ్చగా వుండేది? అవునా చంద్రం..

చంద్ర : అవునండీ ప్రసాదుగారూ! ప్రకృతీ, మనుష్యులూ కలిసివుంటేనే లోకం పచ్చగా వుంటుంది.

* * * *

ప్రసాదు : ఆరవపాఠంలో నువ్వేం చూస్తున్నావు లక్ష్మి?

లక్ష్మి । ఒక చంటిపాప ఏడుస్తూవుంది. రెండవ బొమ్మలో ఆ పాపను ఒక బాలిక ఎత్తుకుని వుంది. ఆ బాలిక వయస్సులో వున్న బాలుడు బడికి పోతున్నాడు.

ప్రసాదు : మూడవ నాల్గవ బొమ్మలలో ఏం చూస్తునావు!

లక్ష్మి । ఒక పురుషుడు ఒక స్త్రీని అర్ధాంగిగా (తనలో సగంగా) వివాహం చేసుకుంటున్నాడు. నాల్గొ

బొమ్మలో తాను దర్జాగా పడుకుని స్త్రీచేత-గర్భిణిగా వున్న భార్యచేత వంట చేయిస్తున్నాడు.

ప్రసాదు : ఆడా మగా అందులో ఎవరు లేకున్నా లోకం నడుస్తుందా లక్ష్మీ?

లక్ష్మి : నడవదండీ ప్రసాదుగారూ.

ప్రసాదు ; ఈ పాఠంద్వారా నువ్వేం తెలిసికున్నావు?

లక్ష్మి : తెలివి తేటలలో, పనిపాటలలో ఆడా-మగా సమానం. మన దేశంలో ఆడవాళ్ళని చులకనగా చూస్తారు. ఆడపిల్ల పుట్టడమే శాపమనుకుంటారు. ఆడపిల్లను కడుపులోనే చంపుతున్నారు. చూడండి ఎంత అన్యాయమో!

ప్రసాదు : ఆడపిల్లలను ఇంకేం చేస్తున్నారు?

లక్ష్మి : పుట్టినప్పటినుండి ఆడపిల్లలను తక్కువగా చూస్తున్నారు. ఆడపిల్లలను బడికి పంపరు. పిల్లలను ఎత్తుకోమంటారు. చాకిరీ అప్పగిస్తారు.

ప్రసాదు ; ఆడవాళ్ళు చదువుకుంటే ఏం జరుగుతుందని ఈ పాఠంద్వారా తెలిసికున్నావు?

లక్ష్మి : అన్నివిధాలా ఆ కుటుంబానికి మేలు జరుగుతుంది. వాళ్ళు అజ్ఞానంలోవుంటే సమాజం చీకటిలో వుంటుంది.

ప్రసాదు : ఈ రోజుల్లో ఆడపిల్లల పెళ్ళిళ్ళు ఎలా జరుగుతున్నాయి.

లక్ష్మి : కట్నాలు కానుకలు ఇవ్వాలి! అడుగడుగునా మర్యాదలు చేయాలి. ఆస్తిపాస్తులు అమ్ముకోవాలి.

ప్రసాద్ : ఇన్ని చేసినా అల్లుళ్ళ కోరికలు తీరుతున్నవా లక్ష్మి?

లక్ష్మి : లేదు! డబ్బుకోసం చేసుకున్న భార్యను హింస పెడతారు! ఆమె బ్రతుకులో నిప్పులు పోస్తారు!

ప్రసాద్ : పురుషులతో పాటు స్త్రీలకు సమానమైన కూలీ వుందా?

లక్ష్మి : లేదు ప్రసాద్ గారు! మగవాళ్ళతో సమానంగా ఆడవాళ్ళు పొలం పనులు చేస్తున్నారు. రాళ్ళు మోస్తున్నారు. మట్టి మోస్తున్నారు. అయినా వాళ్ళకు మగవాళ్ళతో సమానంగా కూలీ యివ్వ డం లేదు!

ప్రసాద్ : ఇంకా ఈ పాఠంలో ఏం తెలుసుకున్నావు?

లక్ష్మి : పొద్దు పొడిచినప్పటి నుంచీ పొద్దుగూకే దాకా బ్రతుకంతా ఆడవాళ్ళకు చాకిరీతోనే సరిపోతుంది. తొమ్మిదినెలలు కని, పెంచేది తల్లి! ఇంతచేసినా ఆడవాళ్ళకు సంఘంలో గౌరవం లేదు!

ప్రసాద్ : లక్ష్మి! ఈనాడు ఆడవాళ్ళు ఏం చేస్తున్నారని పాఠంలో వుంది?

లక్ష్మి : ఆడవాళ్ళు రాజ్యాలు చేస్తున్నారు! యుద్ధాలు చేస్తున్నారు. యంత్రాలు నడుపుతున్నారు. చంద్ర మండలం మొదలైన సాహసయాత్రలు చేస్తున్నారు అవసరం వస్తే మగవారికంటే మేము తీసిపోమని రుజువు చేస్తున్నారు!

ప్రసాద్ : మరి లక్ష్మి! ఈ అన్యాయాలను ఆడవాళ్ళు ఎదిరింపలేరా?

లక్ష్మి : తప్పకుండా ఎదిరించగలరు! ముందు తమకు జరుగుతున్న అన్యాయాలను గుర్తించాలి! ఒక్కటవ్వాలి! ఎదిరించాలి! అప్పుడే రోజులు మారతాయి!

ప్రసాద్ : మరి చదివిన పాఠాలన్నీ జీవితానికి అన్వయించుకుంటున్నారా?

లక్ష్మి : అన్వయించుకుంటున్నాం ప్రసాద్‌గారూ! ఈ మధ్యనే మగకూలీలతో ఆడ కూలీలం కూడా సమానమైన కూలీని సాధించుకోగలిగాం. ఈమధ్యనే మా గూడెంలో ఎంకి మొగుడు తాగొచ్చి పెళ్ళాన్ని చితకబాదుతూ వుంటే, ఆమెకు అడ్డుపడి, అతనికి బుద్ధి చెప్పాం! ఇంక తాగనని ఒట్టుపెట్టుకున్న దాకా అతనిని వదిలిపెట్టలేదు!

* * * *

ప్రసాద్ : ఎనిమిదవ పాఠంలో ఏం చూస్తున్నావు శంకర్?

శంకర్ : రంగయ్య కుటుంబాన్ని చూస్తున్నాను ప్రసాద్ గారూ?

ప్రసాద్ : అతని కుటుంబం ఏ విధంగా పతనమైంది?

శంకర్ : రంగయ్య కష్టజీవి! కూలిపని చేసాడు. అతని భార్య రాజమ్మ! ఆమె కూడ కూలికిపోతుంది. ఇద్దరు పిల్లల్ని చూచుకుంటుంది. ఉన్నంతలో కుటుంబం ముచ్చటగా ఉండేది. ఈ మధ్య రంగయ్య చెడు

సావాసాలతో సారాయికి అలవాటు పడ్డాడు, కూలి యింట్లో యివ్వడంలేదు. భార్యను పిల్లల్ని ఇప్పుడు ఇష్టం వచ్చినట్లు కొడుతున్నాడు!

ప్రసాద్ : తరువాత ఏం జరిగింది శంకర్?

శంకర్ : రంగయ్య అప్పులుచేసి తాగడం మొదలు బెట్టాడు! కుటుంబం పతనమైంది! అందరు చీదరించు కుంటున్నారు. తిండిలేక పిల్లలు రోగాల పాలయి నారు. రాజమ్మ భర్తకు నచ్చచెప్పింది.

ప్రసాద్ : రంగయ్య భార్యమాట విన్నాడా?

శంకర్ : తాగుడు ఇంకా ఎక్కువైంది. ఎక్కడబడితే అక్కడ పడిపోతున్నాడు.

ప్రసాద్ : తరువాత ఏం జరిగింది?

శంకర్ : రాయిలాంటి మనిషి ఎముకల గూడుగా తయా రయినాడు. రంగయ్య! దగ్గుతున్నాడు, మంచాన బడ్డాడు. రేపోమాపో అంటున్నాడు!

ప్రసాద్ : రంగయ్య కుటుంబం గురించి నీవు యేమనుకుంటు న్నావు శంకర్!

శంకర్ : ఇలాంటి రంగయ్యలు మా గూడెంలో, దేశంలో ఎంతోమంది చితికిపోతున్నారు, ప్రసాద్ గారూ! ఎన్ని సంసారాల్లో యీ సారాయి చిచ్చుపెడు తున్నదో చెప్పలేం! ఎంతమంది స్త్రీలు నరకము అనుభవిస్తున్నారో ఎంతమంది పిల్లలు దిక్కులేని వారవుతున్నారో చెప్పలేం ప్రసాద్ గారు చెప్ప లేము !

ప్రసాద్ : సారాయిని గురించి ఇంకా ఏమి తెలుసుకున్నావ్ శంకర్?

శంకర్ : ఈనాడు సారాయిది పెద్ద వ్యాపారం! కోట్లు గడిస్తున్నారు. బీదలు, మధ్య తరగతి ప్రజలు చితికి పోతున్నారు. ఇలా మనుషుల రక్తం పీల్చి వ్యాపారం చేయడం నేరం కాదా ప్రసాద్‌గారూ!

ప్రసాద్ : ఈ రంగయ్య పాఠం విప్లవాత్మకమైనది. ఈ పాఠం చదివే స్త్రీలంతా చైతన్యాన్ని పొంది ఒక మహాశక్తిగా లేచి నిలబడింది. ఈ పాఠం ఒక విధముగా స్త్రీలోకాన్ని ఆలోచింపజేసింది!

శంకర్ : ఎక్కడ ప్రసాద్‌గారూ?

ప్రసాద్ : నెల్లూరులో, మొట్టమొదట దూబగుంట అనే గ్రామంలో కాంతికిరణం వెలిగింది.

శంకర్ : అక్కడ ఏం జరిగింది ప్రసాదుగారు! వివరంగా చెప్పండి వింటాము!

ప్రసాద్ : రాత్రి బడులలో చదువుకున్న స్త్రీలంతా ఈ పాఠాన్ని చదివి అక్కడి స్త్రీలంతా ఒక్కటై, గ్రామాల్లో సారాయి అంగళ్ళను మూయించారు. మద్యపానాన్ని నిషేధించమని ప్రభుత్వము మీద ఒత్తిడి తెచ్చారు. ఈ ఉద్యమము జిల్లా అంతటా మాత్రమేగాక రాష్ట్రమంతటా వ్యాపించింది.

సీత : అందరం అనుకుంటే మనంకూడ ఆపని చెయ్యవచ్చును. ఇన్ని తెలిసిన మనిషి కల్లూ-సారాయికి ఎందుకు బానిసకావాలి? ఇట్లా ఇల్లూ- ఒళ్ళూ ఎందుకు గుల్ల చేసుకోవాలి?

శంకర్ : అవును నిజమే! మనంకూడ మన గ్రామంలో కల్లూ సారా దుకాణాలను మూయించడానికి ప్రయత్నిద్దాం.

అందరూ : మేమందరూ అందుకు సిద్ధం!

ప్రసాద్ : తొందరపాటు కూడదు. ఈరోజున రాష్ట్రంలోని స్త్రీలు మూల మూలనుండి హైదరాబాదుకు వేలసంఖ్యలో వెళ్ళి ప్రభుత్వంముందు ధర్నా చేస్తున్నారు. మా చెల్లెలు సుగుణకూడ వెళ్ళింది. ఆమెకూడ మహిళా సంఘ కార్యకర్త. ఈనాడు మన ప్రభుత్వం ఏదో ప్రకటన చేస్తుంది. రేపు మా చెల్లెలు వచ్చిన తరువాత ఆ విషయం ఆలోచిద్దాం! పదిగంట లయింది! ఇంక ఇళ్ళకు వెళదాం!

అందరూ ; (అలాగే బాబుగారూ! మాకోసం మీరెంతో కష్టపడుతున్నారు! మీ రుణాన్ని తీర్చుకోలేం.

ప్రసాద్ : అదేంకాదు! శంకర్! చీకట్లో ఉన్నవారికి దీప లేఖ చూపించడం మానవధర్మం. అదే నేను చేస్తున్నది. ఇంక వెళదాం. (నిష్క్రమింతురు)

(తూర్పువాకిలి పాటతో తెరవాలును)

# దీపరేఖ

(నాటిక)

(ఆజాద రంగము ఫ్లాష్‌బాక్ దృశ్యము)

(తెర ఎత్తబడును)

యథాప్రకారము పూర్వరంగము మాదిరిగానే
కొంతమంది స్త్రీ పురుషులు పలకా, బలపం,
పుస్తకాలతో కూర్చుని యుందురు)

(ప్రసాద్, సుగుణమ్మల ప్రవేశం)

(అందరూ లేచి నిలబడి నమస్కరింతురు)

ప్రసాద్ : నమస్కారం! అందరూ కూర్చోండి. మా చెల్లెలు సుగుణ ఈరోజున మీకు ఒక శుభవార్త తీసుకొచ్చింది.

అందరూ : ఏమిటా శుభవార్త? చెప్పండమ్మా సుగుణమ్మగారూ! త్వరగా చెప్పండి.

ప్రసాద్ : మన రాష్ట్రంలో మన ప్రభుత్వం సారా నిషేధాన్ని అమలుపరుపబోతూవుంది?

సీత : నిజంగానా? ప్రసాద్ బాబుగారూ! ఎంతమంచి శుభవార్త చెప్పారండీ. మా ఆడవాళ్ళ కష్టాలు గట్టెక్కినవన్నమాట!

ప్రసాద్ : అప్పుడే ఎక్కడ? ఇంకా ఎన్నో కష్టాలు గడతేరాలి, సారానిషేధాన్ని నేటినుండి నెల్లూరుజిల్లాలో మాత్రమే అమలు జరుపుతున్నారు. రాబోవు అక్టోబరు రెండునుండి రాష్ట్రమంతటా అమలు జరుపబోతున్నారు.

లక్ష్మి : సంపూర్ణమైన మద్యపాన నిషేధమా ప్రసాద్ గారూ?

ప్రసాద్ : కాదు! సారాను మాత్రమే నిషేధిస్తున్నారు! కల్లుకొట్లు, బ్రాందీకొట్లూ అలాగే వుంటాయి.

సీత : అవిమాత్రం ఎందుకుండాలి. ప్రజలు సారానుమాని, కల్లు బ్రాందీలకు అలవాటుపడరా ప్రసాద్ గారూ

ప్రసాద్ : క్రమక్రమంగా అంచెలంచెలుగా వాటినికూడా నిషేధిస్తామని ప్రభుత్వం ప్రకటించింది.

లక్ష్మి : సరే! అంతవరకన్నా చాలు. ప్రభుత్వం అమలు జరుపుతున్నందుకు సంతోషం.

సీత : ఓ సుగుణమ్మగారు! హైదరాబాదు వెళ్ళి ధర్నాలో పాల్గొని వచ్చారు. అక్కడ జరిగిందంతా పూస గుచ్చినట్లు చెప్పండమ్మా. మేమంతా వింటాం.

సుగుణమ్మ : జరిగిందంతా చెప్పడానికే గదా నే నిక్కడికి వచ్చింది. శ్రద్ధగా వినండి!

అందరూ : అట్లాగేనమ్మా.

సుగుణమ్మ: నెల్లూరుజిల్లాలో అక్షరజ్యోతితో ప్రారంభమైన స్త్రీలయొక్క మద్యపాన వ్యతిరేక మహోద్యమం నెల్లూరుజిల్లాలో దూబగుంటగ్రామంలో ప్రారంభమై క్రమంగా రాష్ట్రమంతటా వ్యాపించింది. అటు నెల్లూరునుండి శ్రీకాకుళంవఅకు, ఇటు అదిలాబాదు నుండి అనంతపురం వఅకు ఈ వుద్యమం వెల్లివిరిసింది. ధర్నాలు, ఘెరావ్‌లు అన్నిజిల్లాలలో జరిగినవి. స్త్రీశక్తి ఒక మహాశక్తిగా మారింది. మనదేశ చరిత్రలోనే కాదు, ప్రపంచచరిత్రలోనే యిది

అపూర్వం. మద్యపాన నిషేధాన్ని కోరుతూ నిన్నటి రోజున అసెంబ్లీహాలుముందు ధర్నా చెయ్యాలని నిశ్చయించుకొని, గ్రామగ్రామాలనుండి మహిళలు ఉవిళ్ళువ్వుట్టుగా వచ్చారు. బస్సులలో, లారీలలో, కాలినడకతో స్త్రీ సమూహం ఒక మహాసముద్రంలా హైదరాబాదు చేరుకుంది. మన నల్లగొండ జిల్లానుండి కూడ ఎంతో మంది స్త్రీలు ధర్నాలో పాల్గొన్నారు. (లైటు ఆరిపోవును)

(లైటు వెంటనే సీను మారిపోవును)

(ఫ్లాష్‌బాక్ దృశ్యము)

(అసెంబ్లీ హాలుముందు అశేష స్త్రీజనం నినాదాలు చేయుచుందురు)

స్త్రీశక్తి మేలుకుంది!
శివమెత్తి కదిలింది!
ప్రళయకాల పెన్నిధివలె
పెనుతుఫాను హోరువలే
స్త్రీశక్తి మేలుకుంది శివమెత్తి కదిలిందీ!
తరతరాల బంధనాలు - తరలిపోవ చెదిరిపోవ
దురాచార సామాజిక దుష్టశక్తులను మాపగ!
క్రొత్తయుగం రావాలని! క్రొత్తజగం కావాలని!
తానే నిర్ణింపదలిచి తరలిందీ నవశక్తిగ!
మద్యపాన నిషేధాన్ని అమలుపరచాలి!
వరకట్న దురాచారాలు పోవాలి!
స్త్రీలకు ఆస్తిహక్కు కావాలి!

(స్టేజీమీద కొద్దిమంది స్త్రీలుమాత్రమే వుంటారు. ప్రేక్షకులలో ఒకవైపున్న స్త్రీలను రంగముమీద ఉన్నట్లు గానే భావించాలి.)

ప్రభుత్వప్రతినిధి : (తెరలోనుండి బయటకువచ్చి) సోదరీ మణులారా : కొంచెం ఓపిక పట్టండి. మద్యపాన నిషేధం గురించి మన ప్రభుత్వం ఒక సమగ్రమైన ప్రకటన చేయనుంది!

స్త్రీలు ఎప్పుడు? ఎప్పుడు?

ప్ర. ప్రతినిధి : ఇప్పుడే చేస్తుంది. శాంతంగా ఉండండి!

(ప్రభుత్వ ప్రతినిధి లోపలకు నిష్క్రమించును)

(స్త్రీలు నినాదాలు)

(ప్రభుత్వ ప్రతినిధి మరల ప్రవేశించి)

ప్రభుత్వ ప్రతినిధి : సోదరీమణులారా! మనరాష్ట్రప్రభుత్వం ప్రతినిధులు ప్రధాన ప్రతిపక్ష నాయకులతోను, ప్రముఖులతోను దీర్ఘమైన చర్చలు జరిపి ఒక నిర్ణయానికి వచ్చింది. మద్యపాన నిషేధంవలనరాబోయే చిక్కులనుగూడ చర్చించింది.

మహిళాప్రతినిధి : ఇంతకూ వారేం నిర్ణయం చేశారో చెప్పండి.

ప్రభుత్వ ప్రతినిధి : కొంతవరకు మీ కోర్కె నెరవేరింది. సారాను నిషేధించి, సారా దుకాణాలను మూయించి వేయడానికి నిర్ణయించింది.

మహిళా ప్రతినిధి : ఎప్పటినుండి?

ప్రభుత్వ ప్రతినిధి : నెల్లూరు జిల్లా అంతట రేపటినుండే

సారాను నిషేధించడానికి నిర్ణయించింది.

మహిళా ప్రతినిధి : మరి తక్కిన జిల్లాలలోనో?

ప్రభుత్వ ప్రతినిధి : తక్కిన జిల్లాలలో జాతిపిత గాంధీజీ జన్మదినమైన అక్టోబరు రెండునుండి నిషేధించాలని నిశ్చయించింది.

మహిళా ప్రతినిధి; ప్రభుత్వం త్రికరణశుద్ధిగా అమలు జరుపుతున్నదా?

ప్ర. ప్రతినిధి : అవును! త్రికరణశుద్ధిగా అమలుజరుపుతున్నది. దీనివలన ప్రభుత్వానికి ఏడెనిమిది వందల కోట్ల రూపాయల ఆదాయం తగ్గిపోతుంది! అయినప్పటికీ ఒక మంచి సంస్కరణ రాష్ట్రంలో అమలు జరుపుటకు ప్రభుత్వం ఉత్సాహం జూపుతున్నది. స్త్రీలు ఈవిధంగా ముందుకువచ్చి కోరుతున్నందుకు సంతోషంతో ప్రభుత్వం మీ కోర్కెను అమలు జరుపుతున్నది?

మహిళా ప్రతినిధి : మరి యింతకాలం ప్రభుత్వం ఎందుకు జాప్యం చేస్తున్నది.

ప్రభుత్వ ప్రతినిధి : ఇప్పుడు అధికారంలో వున్నవారే ఒకప్పుడు మద్యపాన నిషేధాన్ని అమలుపరచారు! కాని, ఆనాడు. యీ సంస్కరణ జయప్రదము కాలేదు. ఇతరమైన మాదక ద్రవ్యాలను త్రాగి కొంతమంది ప్రజలు ప్రాణాలమీదికి తెచ్చుకున్నారు. ఎంతోమంది చనిపోయారు.

మహిళా ప్రతినిధి : ప్రభుత్వం సమర్థవంతంగా అమలుజరిపితే అలా ఎందుకు జరుగుతుంది?

ప్రభుత్వ ప్రతినిధి : అందువలన ఆ బాధ్యత నేడు ప్రభుత్వం స్త్రీలమీదనే పెట్టింది. ఇప్పుడు మీరే యీ సంస్కరణను జయప్రదం చేయవలసి వుంది.

మహిళా ప్రతినిధి : మరి కల్లు దుకాణాలు ఎప్పుడు మూస్తారు?

ప్రభుత్వ ప్రతినిధి : వాటినిగూడ ప్రభుత్వం మూయాలనుకుంది. కల్లు గీత గీసే సోదరులు తమ వృత్తులుపోతాయని గోలపెట్టారు. అందువలన వాని జోలికి పోలేదు.

మహిళా ప్రతినిధి : అసంపూర్ణమైన యీ సారా నిషేధంవలన ప్రయోజన మేమిటి? ఒకవైపున కల్లూ, మరోవైపున బ్రాందీ విస్కీలు, విదేశీ మద్యాలూ ఉంటాయి కదా! ప్రజలు సారానువదిలి వాటి కలవాటు పడతారుకదా!

ప్రభుత్వ కార్యదర్శి : నిజమే! యిదంతా ప్రజాచైతన్యాన్ని బట్టి వుంటుంది। ప్రభుత్వంయొక్క ఆశయమేమంటే క్రమక్రమంగా అన్ని మాదక ద్రవ్యాలను తొలగించాలని వుంది. ప్రభుత్వం ముందుగా సారాను నిషేధించింది. ఈ సంస్కరణను జయప్రదంచేయవలసిన బాధ్యత ప్రభుత్వంపైననేగాక స్త్రీలపై కూడ వుంది.

మహిళా ప్రతినిధి . ఎందువలన?

ప్రభుత్వ ప్రతినిధి ; స్త్రీజనోద్యమంవలననే యిప్పుడు యీ సంస్కరణను ప్రభుత్వం అమలుజరుపుతూ వుంది. అందువలన స్త్రీలపై ప్రత్యేక బాధ్యత వుంది.

మహిళా ప్రతినిధి : కేవలం స్త్రీలపై నేగాదు, సమాజంలో అన్నివర్గాల ప్రజలపై యీ బాధ్యత వుంది. ప్రభుత్వానికి మా అభినందనలు తెలపండి! ప్రభుత్వం తలపెట్టిన యీ మంచి సంస్కరణను జయప్రదం చేస్తామని చెప్పండి! నమస్కారాలు! యీ పూలదండను, పుష్పగుచ్ఛాన్ని మాకీ శుభవార్తను చెప్పినందుకు మీా కర్పిస్తున్నాం.

ప్రభుత్వ ప్రతినిధి : అలాగే! (స్వీకరించును)

(లైట్లు ఆరిపోవును)

(రంగము మారిపోయి పూర్వరంగమే యథాప్రకారము వేదికపై నుండును)

సుగుణ : ఈ విధంగా స్త్రీలు జరిపిన ఆందోళన జయప్రదమయింది! రేపటిరోజున మన గ్రామములో యీ వార్తను తెలుపుతూ సభను జరుపుకుందాం!

కిట్టి ; అలాగే, సుగుణమ్మగారూ! రేపు యీ సమస్యను గురించి సభ జరుపుకుందాం! గ్రామమంతా సంతోషిస్తుంది!

ప్రసాద్ : రేపు సాయంత్రం అందరు నాలుగు గంటలకు రండి!

అందరు : అట్లాగే ప్రసాద్‌గారూ! నాలుగు గంటలకు వస్తాం

(తూరుపువాకిలి పాటతో తెరవాలును)

(ఫ్లాష్‌బాక్ దృశ్యము పూర్తి)

# దీప లేఖ

(నాటిక)

(ఏడవ రంగము)

(సభా సమావేశ దృశ్యము)

ప్రేక్షకులందరినీ రంగముపైనున్నట్లుగా భావించవలెను. కొంతమంది స్త్రీ పురుషులు రంగస్థలముపై కూచునియుందురు. ఖాళీగా ఒక కుర్చీ యుండును.

ప్రసాద్ : (లేచి) మిత్రులారా! ప్రభుత్వం ప్రకటించిన సారా నిషేధ ఉత్తరువును గురించి అందరు తెలుసుకొనే వుంటారు. నేటినుండి నెల్లూరు జిల్లాలోను, రాబోవు 1993 అక్టోబరునుండి రాష్ట్రమంతటా సారాను నిషేధిస్తామని ప్రభుత్వ ప్రకటించింది. ముందుగా ఈ సభకు అధ్యక్షత వహించవలసినదిగా మన రాత్రి డిలో చదువుకుంటున్న గోపీని కోరుచున్నాను.

(బిడియముతో గోపీ అధ్యక్షత స్థానమున కూర్చునును)

గోపీ : (లేచి) అందరికీ నమస్కారములు ఇప్పుడు మనకు రాత్రి బడిలో ప్రసాద్ బాబుగారితోపాటు అప్పుడప్పుడువచ్చి మనకుచదువు నేర్పుతున్న సుగుణమ్మగారు మాట్లాడుతారు. శ్రద్ధగా వినవలసిందని కోరుతున్నాను. (హర్ష ధ్వనులు)

సుగుణమ్మ : నా ప్రియమైనసోదరీమణులారా! సోదరులారా! ఇంతమంది జనం యీ సభకు వచ్చినందుకు ధన్య

వాదాలు! గత కొద్దికాలంగా రాష్ట్రమంతటా మద్యపానాన్ని నిషేధించమని మహిళా లోకం చేసిన ఆందోళన కొంతవరకు జయప్రదమైంది. రాబోవు అక్టోబరునుండి సారా నిషేధాన్ని ప్రభుత్వ రాష్ట్రమంతటా అమలు జరుపుతుంది. మన గ్రామంలో కూడ సారా దుకాణాలను నిషేధిస్తుంది. దానిని మనమంతా సంపూర్ణంగా సహకరించి జయప్రదము చేయవలసివుంది. (హర్ష ధ్వానులు)

అయితే కొంతమంది దీనిని అవకాశముగా తీసుకొని దొంగ సారాను తయారుచేసి రహస్యంగా అమ్ముతారు. ఇతరచోట్లనుండి తీసుకొనివచ్చి విక్రయిస్తారు. వారిని వేయికళ్ళతో కనిపెట్టవలసి వుంటుంది.

అలాగే దొంగ సారాను అమ్మేవాళ్ళను వాళ్ళు ఎంత గొప్ప వారయినా బట్టబయలు చేయాలి! (హర్ష ధ్వానులు)

కల్లు అమ్మే సోదరులుకూడ తమ కల్లును నీరాగాచేసి అమ్ముకొనవలసినదిగా సూచించుచున్నాను. లేదా కల్లుతో తాటి బెల్లము మున్నగునవిచేసి జీవయాత్ర చేయవలసినదిగాసూచించుచున్నాను. కల్లు గీత సోదరులు ఇతరవృత్తులనుచేపట్టాలి తమ జీవనము కొరకు ఇతరుల జీవితములను పాడుచేయుట తగదుగదా! ఇంతటితో నా ఉపన్యాసమును ముగిస్తున్నాను.

గోపి : (లేచి) ఇప్పుడు ప్రసాదుగారు మాట్లాడుతారు.

ప్రసాద్ : (లేచి) ప్రియమైన మిత్రులారా! సోదరీమణు

లారా! చెప్పవలసినదంతా మా సుగుణమ్మ చెప్పింది. సభ ముగింపు సమయాన ఒకటి రెండు మాటలను చెప్పి ముగిస్తాను. అసలు స్త్రీ శక్తి యీ విధంగా మేలుకొనుటకు, కదులుటకు, ప్రభుత్వం కనీసము సారానైనా నిషేధించుటకు ప్రధాన కారణం రాత్రి బడులేనని నా అభిప్రాయం. (హర్షధ్వనులు)

చదివినది కొద్దికాలమైనా ఆ పుస్తకాలలోని పాఠాలు మహిళా లోకంలో చైతన్యాన్ని, జాగృతిని కలిగించి నవి. నెల్లూరుజిల్లా దూబగుంటలో వెలిగిన ఆ చిరు దీపం రాష్ట్రమంతటా వెలుగులను ప్రసరింపచేసింది. ఈ రాత్రి బడులు ప్రజలందరు అక్షరాస్యులు అయ్యే దాకా కొనసాగవలసిందేనని నా అభిప్రాయం. కేవలం ప్రభుత్వోద్యోగులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు మాత్రమేగాక రాజకీయ పార్టీల వారందరూ ఈ మహత్తర కార్యక్రమంలో పాల్గొని ప్రజలలో చైతన్యాన్ని, జాగృతిని గలుగజేయవలసినదిగా కోరుచున్నాను. (హర్షధ్వనులు)

సంపూర్ణ మద్యపాన నిషేధం అమలు జరిగేదాకా స్త్రీలు నిదురింపరాదని నా అభిప్రాయం. ఉన్నత వర్గాలకు చెందిన స్త్రీలుకూడా తమ భర్తలను, పిల్లలను సారా, బ్రాందీలజోలికి పోకుండ అదుపు చేయవలసినదిగా కోరుచున్నాను. ఈ సంస్కరణచేసి నందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తూ గ్రామ ప్రజలందరూ ఈ విషయంలో ప్రభుత్వానికి సంపూర్ణ

సహకారాన్ని అందింపగలరని ఆశిస్తూ ఇంతటితో ముగిస్తున్నాను. (హర్ష ధ్వానులు)

గోపి : (లేచి) ఒక చదువు వెలుగు గీతంతో సభ సమాప్తమవుతుంది. రాత్రి బడి విద్యార్థి శంకర్ పాట పాడతాడు. రేపటినుంచి రాత్రిబడి యథాప్రకారము సాగుతుంది!

పాట :

చదువు చదువు కోరో! నీ బ్రతుకు దిద్దుకోరా!
రాత నేర్చుకోరో! నీ గీత మార్చుకోరా!

హాలం పట్టి పొలం దున్ను
అన్నా! ఓ రైతన్నా!
పగలంతా కష్టించీ
పనిచేసే కూలన్నా !

చదువు చదువుకోరో! నీ బ్రతుకు దిద్దుకోరా!
రాత నేర్చుకోరో! నీ గీత మార్చుకోరా!

(పాత్రధారులంతా తెరపైకివచ్చి శంకర్ పాటను అందుకుంటారు)

(తెరవాలును)

(సభా సమావేశ దృశ్యము ఏడవరంగము పూర్తి)

(నాటిక సంపూర్ణము)